వేంకటరత్నము, యద్దనపూడి

# కోయలచరిత్ర

రాజమహేంద్రవరము, 1922

Record no. 777

వేంకటరత్నము, యద్దనపూడి.
కోయలచరిత్ర / యద్దనపూడి వేంకటరత్నముచే రచియింపబడినది.- 1. కూర్పు.- రాజమహేంద్రవరము : డి.వి. రమణారావు, 1922.
77 p. ;19 cm.
Record no. 777

Vēṅkaṭaratnamu, Yaddanapūḍi.
Kōyalacaritra / Yaddanapūḍi Vēṅkaṭaratnamucē raciyimpabaḍinadi.- 1. kūrpu.- Rājamahēndravaramu : Ḍi.Vi. Ramaṇārāvu, 1922.
77 p. ;19 cm.
Record no. 777




# కోయలచరిత్ర



యద్దనపూడి వేంకటరత్నముచే

Yaddanappudi Venkataratnam

రచియింపఁబడి

మొదటికూర్పు 500

డి. వి. రమణారావుగారిచే

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె

రాజమహేంద్రవరము.

# కోయలచరిత్ర.



## 1 సాధారణవిషయము.

---

ఇక్కాలపునాగరకులచే ననాగరకులని పిలువఁబడెడు పూర్వపుటార్యులే కోయలు. వీరు భద్రాచలండివిజనునందును, బస్తరు జయపూరు, నిజాంరాజ్యములందలియరణ్యప్రాంతములందును నివసించుదురు. పైప్రదేశములగుండాప్రవహించు గోదావరీనదియొక్కయు, దానియుపనదులయొక్కయు, తీరములు వీరికి ముఖ్యాశ్రయస్థానములు. సర్వకాలసర్వావస్థలయందును, నీరునిలవయుండు గొప్పగొప్పవాగులుగల ప్రదేశములందు కూడ, వీరు నివాసముల నేర్పఱచుకొని యుందురు. వీరు నదులను దాటవలసివచ్చినప్పు డతివేగముగలప్రవాహమునైనను చిన్నచిన్నబుఱ్ఱదోనెలయాధారమున నవలీలగదాటుదురు.

## —* 2 శీతోష్ణస్థితులు. *—

కొండప్రదేశములందు శీత వాతాతపముల ఆధిక్యత కలిగియుండును. వర్ష మెక్కువగా కురియును. అన్యప్రదేశములయందుకంటె నరణ్యప్రదేశములందు తొలకరివానలు ముందుగ ప్రారంభమగును. వేసవికాలమం దెండ లతితీక్ష్ణముగా నుండును. గాలి యపరిమితముగా వీచును. వేసవికాలమందు నదీమధ్యమందలి యిసుకతిప్పలలోని కాలినయిసుకనుండి వీచె

...గాలియును, కార్తీకమాసమందుచుండు నరణ్యాదులనుండియు, కొండలనుండియు, వీచెడు వేడిగాలియును, సూర్యభగవానుని కిరణప్రసారములకడ్డోత్తై, సహింపనలవికానంత, తీక్ష్ణముగా నుండును. రెండుజాములవఱకు సూర్యరశ్మితగులనిగ్రామములు కూడ గలవు. పగలు పదిగంటలవఱకు పొగమంచవిసిపోక, యావరించియుండును. వీరు దీనిని మోడెమని యందురు. శీతకాలమందొకవిధమగు తేమగాలి వీచును. దీనిని వీరు బోదనపు గాలియని యందురు. ఇది విష వాయుమిశ్రితమగు తేమతో కూడియుండును. ఇది వీచుటకు ప్రారంభమే, జ్వరముల కారంభము. బలహీనతత్వములవారి క్కీప్రాంతపు శీతోష్ణస్థితు లనారోగ్యవంతములు.

## —* 3 ఆరోగ్యము. *—

వీరనారోగ్యవంతులు. ప్రతివానికిని బల్లరోగముండును. దీని నాంగ్లేయులు (యన్లార్జిమెంటుఆఫ్‌స్ప్లీన్) అని యందురు. జ్వరజీర్ణమువలన నిదియుత్పత్తియగునట. జ్వరము తగిలినప్పుడు హెచ్చుచుండును. జ్వరముజారినప్పుడు తగ్గుచుండును. వీరియందింకొకవిధమగు నంటువ్యాధియుండును. దీనిపేరు కోయరోగము. ఇప్పుడిప్పు డీరోగము కోయలనేగాక, కోయసంస్పర్శగల తదితరులనుగూడ నావహించుచున్నది. దీని లక్షణములు కొంచెమించుమించు కుష్టరోగమును బోలియుండును. ప్రతికోయవాడును, తనజీవితకాలమం దెప్పుడో యొక



ప్పు డీవ్యాధిబాధ ననుభవింపక తప్పదు. శీతజ్వరమునే మన్యపుజ్వరమందురు. ఇది రెండువిధములుగనుండును. వరుసజ్వరమ్ము మనియు, పాళిజ్వరమనియు, పాళిజ్వరమనునది ప్రతిదినము వచ్చును. వరుసజ్వరమనునది రోజువిడిచిరోజు వచ్చును. ఆరోగ్యానుగుణ్యమగు వస్త్రధారణముగాని, యాహారపదార్థముల పారిశుద్ధ్యతనుగాని గమనింపరు. వాడుకొనుటకు లోహపు పాత్రము లరుదుగా నుండును. స్నానపానీయాదులందలి పరిశుద్ధతయన నెమో, యెఱుగరు.

## —* 4 మందులు. *—

కోయరోగమునకు కోయతైల మనుమందును వాడుదురు. దీనిని కొండలయందు నివసించు రెడ్లవద్దనుంచి తెచ్చికొందురు. ప్రతికోయవాడును నీమందును తనయింటనుంచుకొనును. జ్వరమునకు కొందఱు గంజాయిని వాడుదురు. మఱి కొందఱు పసపును వంటకములలో కలిపి వాడుకొని తినెదరు. కొందఱు వేపచిగుళ్లను, మిరియములతో కలియనూరి ముద్దగాజేసి పంచదార నద్దుకొని తిందురు. మరికొందఱు స్త్రీవేళ్ళనుపయోగింతురు. కోయలలో ముప్పాతికమంది జ్వరమునకు త్రిప్పతాగుటయే మందందురు, వరుసజ్వరమున కొకవిచిత్రమగు పన్నాగము పన్నుదురు. ఒకనిర్దిష్టదివసమున నొకమొక్కకు ఉపవాసము చెప్పి, మఱియొకమంచిరోజున దానికవసరమగు తంతునడపి, యారోజున నామొక్కను సమూలముగ నూడ

జేరికిన, నాతటినుంచి, యాజ్వర మంతరించునట. వీరిలో వైద్యముచేయువానిని వెజ్జుఅందురు.

## —* 5 భూతవైద్యము. *—

వీరికి మంత్రశాస్త్రమునందెక్కువనమ్మకము. భూతప్రేతపిశాచములన్న భయమెక్కువ. వీటిబారినుండి వీరికులవేల్పు వీరిని రక్షించుచుండునని వీరినమ్మకము. వీరికి వాటివలన భయముకలుగునని సందేహము తోచినప్పుడెల్ల తమకులవేల్పును నిలువఁబెట్టి జాతర జేయుదురు. వీండ్లకు చేతబడి యందెక్కువ నమ్మకము. ఎవఁడైనను చేతబడిచే చచ్చినాఁడని అనుమానముతట్టినప్పుడు, నిజమరయు నెపముతో, శవము నెత్తుకున్నవాహకులు యిష్టమువచ్చినదారిని బట్టుదురు. ఆదారి యెవనియింటికియీడ్చునో ఆయింటివాఁడా పనిని జేయించెనని వారునిశ్చయింతురు. అంతటవానిని వర్ణింపనలవిగానంత హింసబెట్టుదురు ఒక్కొక్కప్పుడట్లు హింశింపబడినవారు చచ్చుటకూడ తటస్థించును. వీరికులవేల్పే వీరినాయింటికి త్రోవతీయించినదని వీరికి నమ్మకము.

విశూచ్యాది అంటురోగములు ప్రబలియున్నప్పుడు, ఆయాదేవత లాగ్రామమునకు రాకుండుటకై, గ్రామకట్టుకట్టుటకొకవిధానము నవలంబింతురు. దేవతలను వెజ్జువాఁడు బంధించునని వీరి యభిప్రాయము. వీని నాదినములలో యాహ్వానింతురు. వాఁడొకసీసానిండ సారా నింపుకొని, నోటితో యే



దేనోకమంత్రమును పఠించుచు నూరి అన్నివైపుల ప్రదక్షిణముజేయుచు, ప్రతిదిక్కున కొంచెముసీపాగి, పండ్లుపటపట గొఱుకుచు, జుట్టుముడివిరియబోసికొని, దొప్పెడేసి సారానాదిక్కున బాఱపోయుచుండును. ఈవిధముగా గ్రామమన్ని వైపులను తిరిగినతర్వాత, నాలుగుదిక్కులను నాలుగుతోరణములను గట్టును. అడవిలోగాని, పొలములోగాని, పనిచేయునప్పుడేదైన నొప్పిబట్టిన, దానిని కొండరాజుల దెబ్బందురు. కొండరాజులయెడ అపచారముగావించుటచే, తమకాయవస్థ తటస్థించినదని వారూహింతురు. పిశాచములు, పెనుభూతములు ఆవహించినవని, భయావహులగువారు ఆయాదేవతలకు మేకలను, కోళ్లనుదున్నపోతులను, పందిపిల్లలను బలియిచ్చెదమని మ్రొక్కుచుందురు. మూఢభక్తియుతులగు ప్రజలభయవిహ్వలచేష్టలను, నిర్భయములుగ నొనరించి మనోవ్యధనివారణగావించుటకివి, సాధనములై యలరారుచున్నవి. మనశ్శాంతిలేనివాని కెట్టిదివ్యౌషధములైనను పట్టివ్వవు. మ్రొక్కుతీర్ప తీసికొనిపోబడు జీవనమునకు నరికిబోవుకాలమందా దేవత పూనునని వారినమ్మకము. దేవతపూనినదనుట కిదర్శన మాజీవమాదేవత యెదుట తలవాల్చి నిల్చుండునట. దేవత పూనకున్నచో, ఆజంతువ నెంతమందిలాగినను, విగ్రహము యెదుటకు రానేరదట. పూనకపోవుటకు కారణమేమైయుండునో తెలుసుకొని, తిరిగి దేవతకు అపరాధము చెప్పుకొన్నమీదట తృప్తిపొందిన, పూనునట. లేకున్న పూనదట. మ్రొక్కుతీర్చ

కొనుటకు కొనిపోబడినదైనను, దేవతపూజకున్న, ప్రాణముతోనే ఆజీవమును వదలివేయుదురు. మానవుని యాజ్ఞ లెంతతీక్షణములైనను, ఈశ్వరాజ్ఞ కానిదే అట్టియుత్తరువుల అమలు చలాయింపబడకయె బుట్టదాఖలగుచుండుననుటకిదియొక నిదర్శనము.

—* 6 ఆహారపదార్థములు. *—

వీరికి ముఖ్యమగునాహారపదార్థము జొన్న. ఇందు మూడురకము లుండును. మంచిజొన్న, కొండజొన్న. పిన్నకొండజొన్న. కొండపొల్లయందు పండునది కొండజొన్న. మొదటి రెండుతరగతులుకంటె తేలికగా పండునది పిన్నకొండజొన్న. ముందుగ పిన్నకొండజొన్నను చల్లుకొందురు ఇది మూడుమాసముల పంట. దీనితర్వాత కొండజొన్న కోతకు వచ్చును. వీరే రెండు మూడుమాసములలో, తమ పంటగింజలపై నాధారపడి యుండెదరు. కాని, తదితరసమయములయం దడవి ఫలసాయముపై నాధారపడి తమపొట్టలు నింపుకొందురు. మాంసాశనముపై వీరి కాసక్తిమెండు, చేపలన్న ప్రీతియెక్కువ. అడవిఫలసాయములలో, చన్నగడ్డలు, గాజరగడ్డలు, జీలుగపిండి, వెదురుబియ్యము, వెదురుబొడ్డు, కల్వదుంపలు, కల్వగింజలు, చింతగింజలు, మామిడిజీడి, చెంచలి, దొగ్గలి, గంగపాలి, మొదలగుకాయగూరలను దుంపలను ఉపయోగింతురు. మృగజాతులలో, గుఱ్ఱము, గాడిద, రేచు, కుక్క, పెద్దపులి, చిరుతపులి, మొదలగునవితప్ప, తదితరసాధుమృగముల మాంసమును తిందురు. మొసలిమాంసమునుకూడ తిందురు. పుల్లచీమలను చారుకాచికొని, త్రాగెదరు. ఉసుళ్లనుఒకజాతిరెక్కలపురుగులను ఉడుకబెట్టుకొని తిందురు. వీరిలో వివిధాంతశ్శాఖలున్నవి. ఒకశాఖవారు గొడ్డుమాంసమును తినరు. మఱియొకశాఖవారు గొడ్డుమాంసము నత్యంతాప్యాయనముగ నారగింతురు. ఇంకొకశాఖవారుపాములను, కప్పలను, తిందురు. కోయలకు తాటికల్లునం దాసక్తిమెండు. వీరు యిప్పకల్లు నధికముగా నుపయోగింతురు. తాటికల్లురోజులలో తిండి అసలే అక్కఱలేదు.



—* 7 కూరగాయలు *—

కాయగూర లన్నిరకములు దొరకును. చిక్కుళ్లు విస్తారముపైరగును. కంద, పెండలము పైరగును. పుట్టకొక్కులు (కుక్కగొడుగులవలెనుండును) వాలుపొట్టలు (మొక్కజొన్నకండెలువలె నుండును) విస్తారము కోయలు తిందురు. వీటి ఆకులు చామాకులవలె నుండును. పెండలపుకాయలు, నాగపెండలపు దుంపలనుకూడ వీరు పండించెదరు. వీ రాకుకూరల నన్నిటిని పండించెదరు. అడవినిమ్మకాయలను అడవిమామిడికాయలను యేరి తెచ్చుచుందురు.

—* 8 వంటకములు *—

జొన్నపిండితో జావగాచుకొందురు. దీనిని గటక అందురు. చోడిపిండితోకాచిన అంబలిని సంగటందురు. పెసలు,

బొబ్బర్లు, చిక్కుళ్లు, ఉలవలు మొదలగు కాయధాన్యములను వరిపిండితోగాని జొన్నపిండితోగాని ఉడికించి ముద్దలుగా జేసికొని తిందురు. వీటిని కుడుములందురు. పాలు సమృద్ధిగా నుండుటచే, తరుచు పాయసమును వండుకొందురు. ఇప్పపువ్వును ఇప్పపొక్కు అందురు. వీటిని వేయించి వీటిలో అనపపప్పుగాని, నువ్వుపప్పుగాని, గోగువిత్తులనుగాని, చేర్చి పాకముపట్టుదురు. ఈపాకమును ముద్దముద్దలుగా జేసి, వాటిని ఆకులలో చుట్టబెట్టి కట్టుదురు. వీటిని పాకపుడెప్పలందురు. వారియెడ అనురాగము కలవారికి వీటిని నేమానుగా నిత్తురు. మొక్కజొన్నలతో అన్నివిధములగు పిండివంటలును చేయుదురు. లేతగింజలను రుబ్బి, దానికి బెల్లముజేర్చి గారెలవలె జేసి నేతిలో వేయించుదురు. నేయిదొరకినంత సమృద్ధిగా నూనె దొరకదు. ఈ గారెలు తినుటకు రుచిగానుండునుగాని వారి శరీరులకు కాళ్లపడును.

## —* 9 నీతి. *—

కోయలు విద్యావిహీనులు. మూర్ఖపుపట్టు కలవారు సత్యవంతులు. నీతికలవారు కాని, త్రాగుబోతులు. దుర్వ్యసనాసక్తులు కారు. మొత్తముమీద వీరాడితప్పనివారు. వీరికి బొంకనివారని కూడ చెప్పనొప్పును.

వీరికిపోకులందిచ్చలేదు. దొరికినదానితో తృప్తినొందెదరు. ద్రవ్యార్జనాకుతూహలులు కాని, ఆర్జించినదానిని వెచ్చించుటకు తగినవీళ్లులేవు. అనుభవించుటకు అలవాటుపడినవేగాని, ఆర్జించు



టకుఅవసరముండదు. కావలెననుకోరిక ఉదయించినప్పుడే, ఆర్జించుటయందాసక్తిమెండగుట. ఆసక్తికలిగినప్పుడే పాటుపడనిచ్చగించుట. వీరుతమకున్నపాసలు తీర్చుకొనుటకెంతవరకు అవసరమో అట్టిదానిలభ్యముకొఱకే పాటొనర్చెదరు కాని, కూడబెట్టుటయందాసక్తితో పాటుపడరు. ఎంత ద్రవ్యమిచ్చెదమన్నను, ఆత్మగౌరవమును విడనాడరు. స్వాతంత్ర్యనిరోధకదాయకమగు కూలిపనిచేయుటకు ఇష్టపడరు. తామున్నఅడవి పచ్చగానున్న తమయిల్లునిండినట్లు భావింతురు. వారినిత్యకృత్యములకు అడ్డులేకుండులాగున తమజీవనోపాధికవసరమగు కూలి యిచ్చిన పనిజేతురు. గంటలపరికారము నిర్బంధముతో పని జేయుమనిన, మా పూర్వులనాటినుండియు మాకాయాచారములేదు కావున మేమట్టిపనికిగడంగమందురు.

ఈశ్వరదత్తములగు సౌకర్యములనుండి దూరులుగా జేసినగాని, ఎవరికి నొత్తిడికలుగదు. ఒత్తిడికలిగినప్పుడేగాని యేమానవుడును అన్యులనాశ్రయింపనిచ్చగింపడు. ఇదిసామాన్యమానవులస్వభావము. అనాగరకులగు కోయలట్లుగాదు. వీరికి ఆత్మగౌరవముమెండు. చదువురాని మూర్ఖులగుటచే, విడువనిపట్టుదలగలవారైయుందురు. వీరిస్వేచ్ఛాజీవనవృత్తికిఅడ్డుతగులజూచుట యసిధారావ్రతచర్య. వీరుచిన్నప్పటినుండియువింటిబద్దగురి నలవాటుచేసికొందురు. వీరు నాగరకులగు ప్రజాసముదాయమధ్యమందున్నప్పుడు గొఱ్ఱెలవలె కన్పించుదురు. రుప్పలచాటుకేగగనే, పులులవలె అప్రతిమానధైర్యసాహసములను

ప్రదర్శింతురు. వీరు నీతిశాస్త్రబద్ధులు. అన్యప్రాంతములనుండి యీప్రాంతములకు వలసవచ్చినవారు. ఇప్పుడిప్పుడు వీరిని ధర్మశాస్త్రబద్ధులుగా కూడ జేయజూచుచున్నారు కాని, దాని తత్వము వారికింకను తలకెక్కింపలేకున్నారు

—* 10 జాతి. *—

కోయలలో గొమ్మకోయలు గొట్టుకోయలు ననియిరు తెరగతులవారున్నారు. గొమ్మకోయలలో లింగధారికోయలు కూడ కలరు. నదీతీరములందలి పోళ్లనంటియున్న గూడెములందుండువారె గొమ్మకోయలు. లోమన్యములందుండువారు గొట్టుకోయలు. గొట్టుకోయలలో కూడ శైవమతావలంబకు లున్నారు. వీరు లింగధారణజేయుదురు. గొమ్మకోయలలో తిరిగి వారివారి వృత్తులననుసరించి వడ్డెకోయలు, డోలుకోయలు, కమ్మరకోయలు, మూసరకోయలు, కాకకోయలు, మట్టకోయలు, బాసకోయలు, ననువర్ణభేదములుకలవు. వడ్డెకోయలనువారు సామాన్యకృషికులు వీరికులమునకుసంబంధించిన పవిత్ర కార్యములన్నియు వీరివలన నిర్వహింపఁబడుచుండును. అపర కర్మను నడపించువారు డోలుకోయలు. వీరి తెగలో తక్కువ వారుగా పరిగణింపఁబడుదురు. ఇత్తడితో పనిచేయువారు మూసరకోయలు. కమ్మరముచేయువారు కమ్మరకోయలు కాక కోయలు, మట్టకోయలు, మనలో కూలివాండ్లవంటివారు. బాసకోయ లన సంకరులు. రాచగొండు లనుమరొకతెగలదు. వీరి తెగలో జామీందారులు. గొమ్మకోయలకు గొడ్డు



మాంసమునందలి బిరుచిమెండు గొట్టుకోయలు కప్పలు, పాములు మొదలగువానిని తిందురు. శైవమతావలంబకులు గొడ్డుమాంసమును ముట్టరు. వీరిలో ఒన్నో, రెండో, మూడో, వాలో పెరంబొయ్యో మొదలగు గోత్రభేదములుండును.

—* 11 కులాచారములు. *—

వీరు తమతప్పులను, తమ కులపెద్దలద్వారా పరిష్కరించుకొందురు. వీరిలో విద్యనభ్యసించిన కొందరు కోర్టుల ప్రాముఖ్యతను కనిపెట్టి యిప్పుడిప్పుడు తన్మూలమున సదుపాయములంద జూచుచున్నారు. శుభాశుభ కార్యములు పంటకాలములోనే నిర్వర్తింపబడుచుండును. ఎప్పటి వప్పుడె పరిష్కారము కావలెనను నియమము లేదు. సారాయి నారగింపనిదే పంచాయితీదారులు కోర్టు పెట్టరు. సారాయిని పూరించనిదే కేసు విప్పరు. కేసువిప్పినను, తగవు తెగదు. పంచాయితీవారు విధించు అపరాధముకూడా సారాయియే. ప్రతిగూడెమువారును తమలో నొకరిని పెద్దగాను, మఱియొకనిని పిన్నపెద్దగాను నేర్పరుచుకొందురు. పెద్ద అనువానినే పటేలందురు. పిన్నపెద్ద, పటేలనువానికి, సహాయకార్యదర్శి. ఆగూడెమునం దెవరికేని పనికావలసియున్నను, వీరిద్దరిలో నెవ్వనిదైన నొకని యనుమతిలేనిదే, యాపని నిర్వహింపఁబడదు. ఇట్టిగూడెములసముదాయమున కొకపెద్ద (అధికారి) యుండును. వాని పేరు సముతుదారు సంఘముయొక్క మంచిచెడ్డలను సముతుదార్లు విచారించుచుందురు. ఒకగూడెములో నొకనికేదైన

లభించిన, దానిని అందరికిని పంచిపెట్టునుగాని తానొక్కఁడే అనుభవింపడు. ఏదైన దండుగపెట్టుకొనవలసివచ్చినను. అందరు సమానముగ ననుభవింతురుగాని యొకనితలపైనే బెట్టరు. మాటఖరారనుట కొకపుల్లను విరుతురు. పుల్లవిరుచుటయను నది ఒకగొప్పయానగా పరిగణింతురు. ప్రాణమునైననిత్తురూ గాని చేసినప్రతిజ్ఞనుండి వెనుకకుమరలరు.

—* 12 వా వి వ రు స లు. *—

పూర్వపరిచయములేనివారు పురుషులను దొరలనిన్ని స్త్రీలను దొరసానులనిన్ని పిల్చెదరు. చనవున్నవారు మగవానిని మామ యనిన్ని, ఆడుదానిని అక్క యనిన్ని కూడా వాడుటకలదు. వీరిలో పేరు వావివరుసలతో పిల్చుకొందురు. దీనినిబట్టి వీరియన్యోన్యతెమెండని యూహింపనగును.

—* 13 వై వా హి క వి ధా న ము *—

వీరివివాహావిధానములలో ముఖ్యమైనది రాక్షసము. పిల్లపుట్టగానే ఒకవస్త్రమునున్ను, కొంచెముచమురున్ను కొంతరొక్కమున్ను ముందుగా నిచ్చి ప్రధానము జేసియుంచుకొను ఆచారము కూడకలదు. రాక్షసమునవలంబించి వివాహమాడదలచినవారి విధాన మెట్లుండుననగా. ఒకగూడెములోని వాఁడింకొకగూడెములోని స్త్రీని వివాహమాడదలచినప్పుడు దానినిగురించిన యాచూకి దెలిసికొనుట కాగూడెమందుండు వానిని నొకనిని లోబరచుకొని వానిమూలమున నేస్థలమందు యేవేళ, తనకాస్త్రీ లభించునో తెలిసికొని, ఆసమయమునకు



తనసహకారులతో నచట కేగును. తనతోడివారల నొకరహస్యప్రదేశమం దుండనియోగించి తానొంటరిగా బయలువెడలి ఆస్త్రీరాకకై నిరీక్షించుచుండును. అంతటది కంటికగపడగనే దాని నెత్తుకొనిపరుగిడ మొదలిడును. అట్లెత్తుకొనిపారిపోవునపుడు దానివారెవరైన కనిపెట్టినచో, వెంటబడి దానిని వానిబారినుండి విడిపించుటకై యెన్నివిధములుగానైనను హింసింతురు. ఎత్తుకొనిపోవువాఁడు తానెన్నివిధములుగా హింసింపఁబడినను తానుపట్టినపట్టు విడువక యామెను తనవారున్నచోటికి కొనిపోగలిగెనేని వెంటదరుముకొనివచ్చినవా రంతట వెనుకకు మరలెదరు. వారందరారోజున నింటికేగి మరునాఁడు ఆస్త్రీతలిదండ్రులను పిలిపించి యథావిధిగా వివాహమొనరింతురు. అదివరకే వివాహితయైయున్నస్త్రీయెడ నిట్టి విధాన మవలంబింపరు.

గొమ్ముకోయలపిల్లను లింగధారికోయలు వెలిదీర్చనిదె వివాహమాడరు. వెలిదీర్చుటన, యేడుతాటాకులను వేరువేరు స్థలములందు, విలువంపుగా నమర్చి, ప్రతిదానికిందనుండిన్ని ఆస్త్రీని దూరిరమ్మనెదరు. ఒక్కొక్కయాకుక్రిందనుండి వచ్చినప్పుడెల్ల స్నానముచేయించి కాల్చినబంగారుతో నాలుకను కాల్చి వెలిదీర్చుదురు. అటుతర్వాత ఆమెకు లింగధారణజేసి వివాహమాడుదురు. అంతటనుంచి, ఆయువతిని గొడ్డుమాంసము ముట్టనీయరు. వివాహముకావలసినస్త్రీని ముందుగా యేడుబిందెలనీళ్లతో స్నానమాడించి క్రొత్తబట్ట

లను కట్టించెదరు. కులపెద్దలనురావించి, మాంసాదులతోను, సారాతోను విందులారగించెదరు. వీరిలో మాయనమును లున్నవి. ఒకపురుషుడు యేడుగురుస్త్రీలను వివాహమాడవచ్చును. స్త్రీయు నల్లె చేసికొనవచ్చును కాని, భర్త సజీవుడైయుండి వివాహములమలులోనున్న యెడల వివాహమాడకూడదు.

—* 14 దేవతలు జాతరలు. *—

వీరు తాము పాండవమధ్యమునిసంతతివారమని చెప్పుదురు. వీరికులదైవము భీముడు. రేచుకుక్క భీమునిబంటగ నెంచి దాని నతిగౌరవముతో ప్రేమింతురు. వీరికి యిలవేల్పు మామిలి. ఈదేవత నివాసస్థానము బస్తరురాజ్యము. ప్రతి కుటుంబమునకును ఒక కులవేల్పుండును. కొత్రరాజులను (అనగా పెద్దపులిరాజు) వీరు ఆరాధింతురు. వేల్పుఅనునది త్రాసువలె యినుపముక్కలతో చేయబడియుండును. అడ్డముగానుడుకడ్డీ కిరుప్రక్కలనుకండ్లవంటి రెండు వెండి రేకులనమర్తురు. దాని మొకవెదురుగొట్టమునందుంచి దాని నారాధించుట కేర్పడిన వాడుమాత్రమే గుర్తింపగలిగినట్లు ఒకరహస్యప్రదేశమునం దుట్టి దాచును. వేల్పులన్నియు కలసి 101 ఉండును. ఈ వేల్పుల వారందఱును తమతమవేల్పులను నెత్తిపైనిడుకొని తదితరకుటుంబములవేల్పులతో కలుపుచు, సంవత్సరమున కొకసారి మామిలివద్దకు జేర్చుదురు. పాలచెట్లు పుష్పించిన కాలమం దీయమ్మకు జాతర జేయుదురు. మామిలిని వీ రాది శక్తియందురు. ఈ మెకు పూర్వము నరబలి యిచ్చెడివాడుక



యుండెడిది. ఇప్పుడీయాచారము తుదముట్టింపబడుటచే మానవునితో తుల్యమగువానరమును బలి యిచ్చెదరట. విశూచి మొదలగు అంటుజాడ్యములు ప్రబలియున్నప్పుడు తమతమ వేల్పులను నిల్వబెట్టి జాతర చేయుదురు. జాతర చేయదలచినప్పు డొకపందిరిని నిర్మించి, దానినీడను తమవేల్పును నిలువబెట్టెదరు. వేల్పున కిరుప్రక్కలను రంగులగుడ్డపేలిక లతుకబడిన జాడాలను కఱ్ఱలకుగట్టి పాతుదురు. అట్లు అతుకబడిన చిత్రవర్ణపుపేలికలు తమతెగకు సంబంధించిన పెద్దలస్మరణచిహ్నము లందురు. జాతరదినములు గడచినతర్వాత వేల్పునకు బలిహారణ మర్పించి, యథాస్థానమునకు సాగనంపెదరు. సమూహమునుబట్టి ఒకటిగాని, అంతకెక్కువగాగాని, గోవులను వధియించి ఆమాంసముతో జాతరయందు నిమగ్నులైన బంధుమిత్రపరివారాదులను తృప్తిపరచెదరు. శుభమునకైనను అశుభమునకైనను గోవును వధింపనిదే తంతును ముగింపరు.

—* 15 పండుగలు. *—

కోయలు సంవత్సరాదిని యుగాదిపండుగందురు. శ్రీరామనవమిని పెరుమాళ్లపెళ్లి అందురు. వైశాఖశుద్ధపౌర్ణమిని నక్షత్రములుపున్నమందురు. భీముని పండుగ జేతురు. కొత్రాజులను (అనగా పులిరాజులను) కొల్తురు. వేల్పులకు జాతరలు జేయుదురు. వీరికి చేనుపండినప్పుడెల్లా పండగే. పండగ జేయనిదే పండినదేదియు ముట్టరు. ఉగాదిపండుగ నతిశ్రద్ధతో నిర్వర్తింతురు. ఎంతలేనివాడైనను ఆరోజున నూతనవస్త్రము

లను ధరియించును. గూడెములోని వారందఱు గుంపులుగా గుమిగూడెదరు. తమకు అభిమానులగు వారలయిండ్లకు బహుమతుల నందవత్తురు. అట్టితరి వీరొకవిధమగు వికృతపు పాటలను పాడుదురు. వీరీపాటను రే రే రే అను శబ్దముతో మొదలుపెట్టి నోటికివచ్చినట్లెల్లా కవిత్వము నల్లుదురు. దీని యర్థమేమన తమకు బహుమతియిచ్చినవారిని పొగడు అర్థమిచ్చునట. పాటపాడునపుడు నృత్యముకూడ జేయుదురు. నృత్యముచేయునప్పుడు ఒకరిచేయి నింకొకరు పట్టుకొని వలయాకారముగా దిరుగుచు అడుగుమార్చుచు గానము చేయుచుందురు. వీరిలో మగవారు కొమ్ములుగల యెనుతల వంటి బుట్టటోపీలను నెమలిపింఛములతోను, అందముగానుండు నితరపిట్టజాతుల వెండ్రుకలతోను వాటినలంకరించి తమతలల కుతగుల్చుకొందురు. మెడయందొక పెద్ద ఢోలుండును. ఢోలు వాయించుచు, కొమ్ములున్నతలతో పొడవవచ్చు ఆబోతువలె మోకరించుచు, స్త్రీలతోపాటు ఆటలాడి పాటలుపాడుదురు. వీరిభాష తెలిసినవారి కీతంతంతయు వింతగానెదోచునుగాని తెలియనివారికిది యొకవికృతముగా కనుపించును. వివాహాది శుభకార్యములయందు కూడ నిదే విధముగా నృత్యగానములు జేయుదురు. కొమ్ములతలలను తగుల్చుకొను పురుషులు తమకులమువారియెదుట తమతమపరాక్రమమును ప్రదర్శించు నిమిత్తము మత్తెక్కిన వృషభ మెన్ని విపరీతచర్యలనాచరించునో అన్నిటిని వీరుకూడ ప్రదర్శింతురు. విస్తారము బరువైన



గల వస్తువుల నవలీలగ పైకెత్తిపారవేయగలుగుటయే వీనియన్నిటిలోను ముఖ్యమైనది. ఇట్టిబలమును ప్రదర్శించిన వాఁడాకులములోని వారిమెప్పులకు పాత్రుఁడగునఁట.

—* 16 వృత్తి *—

వీండ్రకు వ్యవసాయము వేట, ముఖ్యవృత్తులు. పశువులదొంగతనముకూడ బాహాటమైనవృత్తియే. ఇదివఱకు ద్రవ్యము దొంగిలించుట నెఱుఁగరుకాని, సంస్పర్శదోషమువలన నిప్పుడిప్పుడలవాటుపడుచున్నారు. వీరు దొంగిలించినపశువులను, కత్తితో గోసి చంపరు. గొడ్డలి తిరుగవేసి, కొమ్ముల మధ్యముగా నుండుముచ్చిలిగుంటయందు కొట్టి చంపుదురు. వీరు తఱుచు దుక్కిటెడ్లను దొంగిలింతురు. వాటిని దొడ్డినుండిగాని, మందనుండిగాని, తప్పించుటతిసులభము. ఆవులు, పెయ్యలు బెదరి పారిపోవును. దున్నపోతులు గేదెలు, దొరకినను వెంటరాక తిప్పలుపెట్టును. అందువల్ల వాటిజోలి కంతగాపోరు.

—* 17 వ్య వ సా య ము*—

సామాన్యవ్యవసాయము, పోడువ్యవసాయము, లంకవ్యవసాయము అను మూఁడువిధములవ్యవసాయము చేయుదురు. వీరికి విస్తారము భూమి దున్నవీలున్నదికాని, దున్నుకొనుటయందాసక్తి తక్కువ. ఒకవేళ అభిలాషయున్నను తగుప్రోత్సాహముగాని, ద్రవ్యసహాయముగాని లేదు. అప్పుజేసి వ్యవసాయము

చేసినందువల్ల వచ్చినలాభము, పండించుట కగుకర్చులక్రింద
ను, తెచ్చిన సొమ్ము కగువడ్డిక్రిందను సరిపోవును. వీరికి
భూమినమ్ముకొనుహక్కు లేదు. కాని యిష్టమువచ్చినచోట అ
డవి నరికి వ్యవసాయముచేసికొనవచ్చును. వీరు వ్యవసాయము
చేయుభూములకు ప్రభుత్వమువారు పట్టీనాలుగా ఝంపారకీ
పట్టాల నిత్తురు. అనుమతిలేకుండా అక్రారిజర్వులో యెవరైనను
సరె పోడువ్యవసాయము చేసికొనవచ్చునుగాని, అనుమతికొర
కు దరఖాస్తుపెట్టియెడల, ఆఅక్రారిజర్వేగూడెమునకు సంబం
ధించినదో, ఆగూడెమందలికోయల అనుమతిలేనిదే, దరఖాస్తు
మంజూరుచేయబడదు. పోడువ్యవసాయమునకు మెరకరేటు
0_4_0 పల్లపురేటు 0_8_0 లు. వీరు వ్యవసాయముచేయు
భూమియందలి చెట్లు అచిరకాలమందె కొట్టబడినవగుటచే,
లోనుండువేళ్లు చీకవు. పైనుండుమోళ్లక్కడక్కడ కన్పించు
చుండును. నాగలిచాలు లోతుగా పోనిచ్చిన, చీకనిచెట్లవేళ్లు
చిక్కుము నాగలికి తగిలి నాగలి విరిగిపోవును. కావున దుక్కి
చాలు లోతుగా నుండదు. నాగలికూడ చిన్నదిగాను సన్నము
గాను నుండును. వీరికి వ్యవసాయమునం దంతగా నేర్పరితనము
లేదు. వీరికి పండుపంట భూమిసారమునుబట్టి యుండునుగాని,
వీరిపనివానితనమునుబట్టి యుండదు. వీరికి మందలనుపెంచుట
యం దాసక్తి మెండు. వీరు దుక్కిటెడ్లకు అవసరమగుకస
వును నిల్వజేసికొనరు. చేనుపండినతర్వాత పైకంకులనుమాత్ర



మేరుకొని తరువాత, తమమందల నాచేనిలోనికి విడిచిపెట్టు
దురు. వీటి కామేత యొకటిరెండురోజులుమాత్రము సరిపో
వును. కసవు యెద్దడికాలములో వీరిపశువులను మేతకొర
కితరప్రాంతములకు తోలుకొనిపోవుదురు. మెరకవ్యవసాయము
నకు తొలకరించినప్పటినుండియు దుక్కిదున్ను టవసరము.
మేతకై తోలుకొనిపోబడుటచే, వీరిపశువు లప్పు డింటివద్ద
నుండవు. అందువల్ల వీరిభూముల కదునులో దుక్కి పడదు.
చల్లుతరుణము రెండుమూడువారము లుండుననగా వీరు దున్న
మొదలిడుదురు. ముందుగా తమయింటినంటియున్న పాటిపెర
ళ్లను దున్ని వాటిలో చామ, గంటి, మొక్కజొన్న మొదలగు
తేలికపైర్లను పెట్టుదురు. పిన్నకొండజొన్నకూడ నీతరుణ
మందె చల్లుదురు. పెరళ్లలోనిపై రేరుకొని వాటినే తిరుగ
దున్ని పొగమొక్కలను నాటుదురు. పొగనారుపెంచువిధాన
ముగాని, నాటు ఆచారముగాని, వీరికి తెలియదు. ఇప్పుడిప్పు
డీవిధానము నవలంబించుచున్నారు. పొగవిత్తనములను చల్లి,
మొలకలెత్తినతర్వాత అవి యెండకు వాడకుండులాగున ప్రతి
మొక్కకును టేకుఆకుతో నొకగూ డమర్తురు. కట్టకడపట
మదగనేలలను, తెల్లనేలలను దున్ని జొన్న చల్లుదురు. అటు
తర్వాత రేవడి, పుల్లుడు, గరపనేలలను దున్ని మెట్టపైరులను
పెట్టుదురు. పైనుదహరించిన వరుసను వ్యవసాయముచేయు
టలో నేరకపుభూమిదున్నవలసినతరుణములో వర్షమెగబెట్టినను
ఆరకపుభూములు విత్తబడకుండా బీడుగా నుండవలసినదే. తరు

ణములననుసరించి, ముందుగా దున్న మొదలిడిన చల్ల వలసిన తరుణములో వర్షమెగబెట్టినను, విత్తవలసినతరుణములో దున్నుటకు, చాలురాదేమో అను భయముండదు. చల్లవలసిన తరుణమునకు అతిస్వల్ప కాలము ముందు దున్న మొదలిడుటచే, చల్ల బోవుసరికి ఇనమారుకన్న నెక్కువగా దున్నబడవు. దుక్కిచలవలేనిదే పంట యింపుగాపండదు. ఎంతయెక్కువగా దున్నితే అంతయెక్కువగాపంటపండును. వీరివ్యవసాయమునకు విస్తారము వర్షమవసరములేదు. పల్లపుపంట పూర్తిగా పోయినప్పుడు వీరికి పంట విస్తారముపండును. వర్షములేమిచే పల్లపుపంటలు (అనగావరి) చెడును. వర్షము విస్తారము కురిసిన మెరకపంటలు (అనగా జొన్న, అపరాలు మొదలగునవి) పోవును. వీరిది విస్తారము మెరకసాగే. చల్లినచేలు మొలకలెత్తినప్పటినుండియు తమచేలకు అలవలను కట్టుకొందురు. అడవి మృగముల నదలించుట కొకమంచె నాచేనునం దమర్చుకొందురు. వీ రెంత కాయుచున్నను, పందులు, దుప్పులు, కణుసులు మొదలగునవి పాడుచేయక మానవు. కోయవానికి కోమటి యందున్నంతనమ్మకము సర్కారువారియందైన నుండదని నమ్మవచ్చును. మూడువంతులు తమచేలను, పసుపుగుత్తలపైనే షాహుకార్లకు వప్పగింతురు. ఒకవేళ పండువరకు ఆపుజేయ గలిగినను, కళ్లమైనమరుచటిరోజునుండియు, తినుటకు గింజ లుండవు. చేను కంకెవేసినప్పటినుండియు, రైతునకును, వాని పరివారమునకు ఊచబియ్యమే జీవనాధారము. పచ్చి పెసర,



శనగ, అలచంద మొదలగు కాయల నొకప్పుడు కాల్చినవి యును, మఱియొకప్పుడు పచ్చివియును కూడతిందురు. ఇవిపండే రోజులలో అన్నమున్ననుసరే లేకపోయినను సరే. తాటికల్లా రురోజులలోను, చేనుపంటకాలములోను, వీరితో మాట్లాడ వలనుండదు. చేనుపంటకు పూర్వాపరములందొక నెలరోజుల వరకు పిల్చిన పలుకరు. ఆకాలమునకు మనుగుడుపుపెండ్లికొడుకులవలె నుందురు. ఒకడు తన చేనుకోయుట కుపక్రమించెనేని రెండవవాడు తనచేను కోతకు వచ్చినా, రాకున్నా కోసికొనితీరవలెను. లేకున్న చేనుకోసికొన్నవాని చేనులోని దంటు మేయుటకు వదలిపెట్టిన పశువులు కోసికొననివాని చేను మేసిపోవును. ఇట్టిదానినిగురించి తగవు పెట్టినను, పాయమాలు అని కొంత అపరాధమును విధింతురుగాని, ఆసొమ్ము ఆరోజు నన పంచాయితీకర్చులక్రింద కర్చు అగును. ఆరోజున వాండట్లుకర్చుపెట్టకున్న మరుచటిరోజున వానిముఖము చూడరు. చేలలోనింకలుపుతీయరు. చేలోకలుపు పైరుతో సమముగా కొంత యెత్తుపెరిగినతర్వాత కలుపుమొక్కలను పీకి పాడిగేదెలకు మేపుదురు. జొన్న వత్తుగా చల్లుదురు. యీవనని తోచిన మొక్కలను పీకి, కట్టలుగా కట్టి పందిళ్లపై నాంబెట్టి దూడ మేత కుపయోగింతురు. వీరికి మెట్టవ్యవసాయమునందున్నంత అభిరుచి, పల్లపువ్యవసాయమునం దుండదు. చెరువులనీటితో వ్యవసాయముచేయుటన వీరెఱుంగరు. నీరునిల్చుపల్లపుప్రదేశములను కుంటలనియందురు. కోయలిట్టి కుంటలయందును, గట్లు

తెగి నీరోడిసిపోవు వాటిచెరువుగర్భములందును వరివిత్తనములను చేతితో చల్లుదురు. ఈవిధానము నితరచోట్ల కరివేత అందురు. ఊడ్పువిధాన మిప్పుడిప్పుడు కొంద రవలంబించుచున్నారు. ఆకుమళ్లను పెంచుటన వీరి కొకవింతగా కనుపించును. కోయలు దున్నకుండా పండవలె ననికుతూహలపడు సోమరులు. తమచేలకు మందగట్టుట తప్ప మరియే యితరమరమ్మతుచేయుటయందును శ్రద్ధవహించరు. పశువులదొడ్డిని రోజునకొకపర్యాయముచొప్పున ఒకచోటునుండి మరియొకచోటికి మార్చుచుండినను, చేనంతా కలియువరకు మార్చుచుండుటకు వ్యవధిచాలదు. అందువల్ల మందకేసిన చోటునందు పండుటయు కలియనిచోట నెండుటయు తటస్థించును.

గొల్లవాండ్రు తమ మేకల నడవికి మేతకు తోలుదురు ఆయాతరుణములయందు వ్యవసాయమునందు శ్రద్ధగలవా రెవరైన నున్నయెడల మందలవాండ్లకు భత్యమిచ్చి, ఆమందలను తనచేలో పరుండబెట్టుట కేర్పాటుగావించి, రాత్రులయందు తాను వాటివద్దపరుండి, జామున కొకపర్యాయ మామందలోని మేకలను, గొఱ్ఱెలను లేవగొట్టుచుండును. ఈజాతికి లేచినప్పుడెల్ల మలమూత్రములు విసర్జించుట స్వాభావికము. చేనునందెక్కువ పెంటపడుటకు వీలగునని వీరట్లు దలంచుచుందురు. కుప్పలనునూర్పించుటకు పశువులసహాయ మక్కఱలేదు. కంకులను కుప్పగావేసి మనుష్యులే బడితెలతో మోదుదురు. బడిత



బట్టినవాడు రాలగొట్టినగింజలనుబట్టి కూలి యిచ్చెదరు. తమ సాగుబడిభూమిపరిమితమును చెప్పవలసివచ్చినప్పుడు యకరములనక మంచె లందురు. మంచెపాలమనగా ఒకమనిషి మంచెపైనుండి కాపుకాయగలిగినంతభూమియని వీరి యభిప్రాయము ఇది సుమారు నాలుగైదుయెకరములుండును. వీరియొక్క మోతుబరి వీరివద్దనుండు పశుసముదాయమునుబట్టిన్ని, వీరు కట్టు అరకలనుబట్టియు, వీరు దున్నుభూమివిస్తీర్ణమునుబట్టియు, నిర్ణయింపఁబడును. అప్పిచ్చుబోవువారు నీకు యెందరు కాయుగొడ్లున్నవి? ఎన్ని అరకలను కట్టుదువు? ఎన్నిమంచెల పాలమున్నది? అని ప్రశ్నించుదురు వీరిలో స్వంతఅరకలతోను, స్వంతమనుష్యులతోను, స్వంతద్రవ్యముతోను వ్యవసాయముచేయఁగలవా రరుదుగా నుందురు. వ్యవసాయముచేయుటకై కోరుసహాయమునే పొత్తుకలుపుకొనుట అందురు. ఎద్దులులేనివారు ఎద్దుల నద్దెకు తెచ్చుకొందురు. దీనినే గుత్తకు తెచ్చుట అని కూడనందరు. కోమట్లుకోయలవద్ద తాము జనవరిలగాయతు మార్చివరకు తోలితెచ్చుకొన్నయెద్దులను జూన్ లగాయతు డిశంబరు వరకు తిరిగి వీరికే గుత్త కిచ్చెదరు. ఇట్టిగుత్తమొత్తము అడుగువారి యవసరమునుబట్టి నిర్ణయింపఁబడుచుండును. వీరు క్రయపరుచుట అనుదానికి కట్టుకొనుట అనుమాట నుపయోగింతురు. వీరిక్రయములకు వ్రాతమూలము లుండవు. రిజిస్ట్రేషన్ డిపార్టుమెంటు అమలులోకి వచ్చినతరువాతకూడ వీరు తమ

పూర్వాచారము ననుసరించి కట్టుకొను విధానమునే అవలంబిం
పంబోగా నీడిపాటుకామోటు సదుపాయమునెరింగినకొందరు
చదువుకొన్న కోయలు నిర్బంధవిధానము నవలంబించిరని
ఫిర్యాదుచేయసాగిరి. తాము దౌర్జన్యమవలంబింపలేదనుటను
రిజస్ట్రీదస్తావేజు లేకపోవుటచే ఋజువుచేయలేక వారియాస్తిని
వారికి వప్పగించి బాకీని వదలుకొని బ్రతిమాలుకొనుస్థితిలో
నికి యిప్పుడిప్పుడీ కోమట్లు వచ్చుచున్నారు. కోయలు కోమ
ట్లవద్ద గుత్తకుతెచ్చుకొన్నయెద్దులను తమపని ముగియగనే
కోసికొని తిని పులి యెత్తుకొనిపోయినదని చెప్పమొదలిడిరి.
ఇప్పుడు వీరిట్లు అద్దెకు తెచ్చుకొనగలుగు పరపతినిగూడ కో
ల్పోయిరి. కట్టినఅరకలనుబట్టి, పండినపంటను పాళ్ళువేసికొం
దురు. లోపాయికారీవ్యవసాయదార్లు పాలికేగాని రొఖశిస్తునకు
భూములను కవులునకు పుచ్చుకొనరు. పాలనగా, పండినపంట
లో భాగమిచ్చువిధానము. కట్టుగుత్తలకుకూడ పుచ్చుకొందు
రు. కట్టుగుత్త అనగా పండినా, యెండినా కొంత ఆయివైజు యి
చ్చుట అనియర్థము. పొత్తుకలిసి చేసినవ్యవసాయమువల్ల వచ్చిన
పంటలో ముందుగా భూమిపాలును మినహాయింతురు. మిగి
లినదానిని వాటాలవెంబడి పంచుకొందురు. పొత్తుకలియు
విధానమం దొక చిత్రముండును. ఎట్లన, పశుసముదాయము
గాని, ద్రవ్యబలిమిగాని లేని భూమిగలవాడు పైరెండును సమృ
ద్ధిగానుండి దున్నుటకుమాత్రము భూమిలేనివానితో పొత్తుక
లియును. పొత్తుకలిసినవాడంతటనుండి తనను పొత్తుకలుపు



కొన్నవానిపొట్టకున్నూ, వ్యవసాయమునకును పెట్టుబడి పెట్టు
చుండును. పండినపంట తనపాలుక్రిందనున్నూ, తనపెట్టుబడి
సొమ్ముక్రిందనున్నూ పొత్తుకలసినవాడు కాజేయును. తనకూటి
కామరుచటిదినమునుంచి, కఱవగుటయేగాక, భూమిపై శిస్త
యినను చెల్లదు. శిస్తున కామరుచటిసంవత్సరమే వేలమగు
ను. పన్ను చెల్లింపనందున, వేలమగుటచే, జీవనోపాధికి తెలివు
గానక, భూమి ఖామందు పరారి యగును. కొందఱు భాగ్యవం
తులు, భూమిని కొనగలిగియు, కొనక, అప్పులతో మునిగి వ్య
వసాయము జేసికొనశక్తిలేని రైతులను జేరదీసి, తమచే
యూత యనునెపముచే వారి కనాయాసముగా, సన్యాసమి
ప్పించగలుగుచున్నారు. ఈదేశపుపెట్టుబడిదార్లవలంబించువిధా
నముకూడ వీరిదుర్భరస్థితికి దోడ్పడుట కుపకరించుచున్నది.
కొందఱు పరమదరిద్రులను జేరదీసి, వాని కొకకాడియెద్దులను
ఒకబండిని, కొని యిచ్చెదరు. వ్యవసాయమునకు వీలులేని తరు
ణములయందు తమస్వంతపనులకొఱకీబండ్ల నుపయోగింప ని
యమించెదరు. బండివల్ల వచ్చు ఆదాయములో గృహకృత్య
ము వెళ్ళబుచ్చుకొమ్మందురు. వ్యవసాయపు తరుణములో, అ
మ్ముకొనుటకు హక్కుగల జమీందారీభూముల వ్యవసాయ
మునకు ప్రోత్సహించెదరు. అట్టివి యలభ్యమైనచో, సర్కారు
అరణ్యరిజర్వులలో పోడు వ్యవసాయమునకు ప్రోద్బలింతురు. వీ
డు వ్యవసాయము మొదలుపెట్టువరకు, వీని పెట్టుబడిదారులు,
వీనిక్షేమముకొఱకెంతో తాపత్రయపడుచున్నట్లు నటింతురు.

మందభాగ్యులగు ఆబీదరైతులును, తమక్షేమమపేక్షించియే, తమపెట్టుబడిదార్లు తమకొఱకుపాటుపడుచున్నారని యోచించి తమకులేని యుత్సాహమైనను తెచ్చిపెట్టుకొని, క్రొత్తభూములు సాగుకనుకూలమగులాగున, చెట్లు, రుప్పలు, కొట్టి, మోళ్లుత్రవ్వి, పుట్టలుత్రవ్వి, మిట్టపల్లములుసరిచేసి రాత్రియనక, పగలనక, యెండకుమాడి, వానకోర్చి, ఆకుది, మగవాండు పాటుపడి, సస్యానుకూలముగా జేతురు. పూర్తిగా మోంకుపీకి, వ్యవసాయయోగ్యమగు సరికి అధమము అయిదారు సంవత్సరములు పట్టును. ఈలోపుగా వాలీనాపండినపంట పెట్టుబడిదారుని కివ్వవలసిన మొత్తమున కగువడ్డికిక్రింద సరిపోవుచుండును. మధ్య మధ్య వడ్డి అసలులో కలిసి, మొత్త మభివృద్ధి యగుచుండును. పెట్టుబడిదారునకు యీలోపుగా, వీడు సాగుచేయుచున్నభూములలో సారమైనదేదో నిస్సారమైనదేదో కనిపెట్టంగలుగును. తనకు ఆనుచిక్కినతర్వాత తన బాకీని వసూలు ఇవ్వమని నిర్బంధింప మొదలిడును. వాడు వాని అశక్యతను వెల్లడించినంతనే దాని నూతగా గొని భూములను బాకీక్రింద కట్టమనును. అప్పుతీరుసాధనము లేనందున మొండెత్తువేశిన మొదటికే మోసమువచ్చునేమో అనుభీతిచే, కొన్నిటినిమాత్రము కట్టి మిగతా బాకీ పంటపైన తీర్చికొందు నని చెప్పి వప్పించును. పెట్టుబడిదారు, వీడు వ్యవసాయముచేయు భూములలోని మంచి చెడ్డ లదివరకే యెఱిగియుండుటచే, తనకు కావలసినప్రతులను చేర్చుకొని, వాటిని కొంతబాకీక్రింద క్రయము వ్రాయించుకొ



నును. ఆమరుచటి సంవత్సరము మిగతాభూములక్కొ కొన్నిటిని, శేషించినబాకీలో కొంతభాగముక్రింద వశపరుచుకొనును. అటుతర్వాత వాని పాడిపశువులపైన దండెత్తును. తుదకు బండి, యెద్దులనుకూడ బాకీలో మరికొంతభాగమునకు విలియాం వేసికొనును. అంతట క్రొత్తగా తయారుచేయంబడిన రైతు పూర్వపుస్థితికి మారును కాని, పెట్టుబడిదారునితో గల ఋణసంబంధము మాత్రము వదలదు. అటుపిమ్మట పెట్టుబడిదారు వ్యవసాయదారుండగుట తటస్థించును. తాను కొన్నభూములు తాను తయారుచేసిన సన్యాసికే పాలి కిచ్చి దున్నించును. పంటసమయమందు వానిపాలునకు వచ్చుగింజలను తాను భూతాదికి బదులిచ్చినగింజల అసలీఫాయిదాలక్రింద కాజేయును. ఒకవేళ నింకా మిగులుట తటస్థించెనేని, తనకుండు, పాతబాకీక్రింద జమకట్టుకొనును. వాండింకముందు యెట్టిపేచీపెట్టుటకు శక్తిలేదని తోచినప్పుడు, నిల్చియుండు బాకీకి వానిపై దావాచేసి డిక్రీపొంది తనను వాండింకముందు పీడించకుండులాగున దూరుండుగా జేసికొనును. ఒకవేళ కోర్టులో బాకీ లేదను వాదముపెట్టినను, శాస్త్రోక్తముగా తయారుచేసిన లెక్కలను నమ్ముదురు కాని, మూజువానీగా చెప్పుకొనజూచు నిరుపేదయగు వ్యవసాయదారుని మాట సత్యమేయైనను నమ్మరు. అందువల్ల వారసహాయులై న్యాయస్థానములయందలి సౌకర్యములనందలేకున్నారు.

## —* 18 పోడు వ్యవసాయము *—

కోయలు ముఖ్యముగా జేయు వ్యవసాయము పోడువ్యవసాయము. దీని నాంగ్లమున షిఫ్టింగుకల్టివేషన్ (Shifting cultivation) అందురు. వ్యవసాయమునందు బాలురు వృద్ధులు, స్త్రీలు పురుషులు అనువివక్షత లేక పాటుపడుదురు. అడవిలో కొంతప్రదేశమునందుండు చెట్లను, రువ్వలను నరికి వాటిని కుప్పలు కుప్పలుగా అక్కడక్కడ జేర్చి కొన్నిరోజు లట్లు వాటి నెండనిత్తురు. కొంతకాల మారినతర్వాత ఆకుప్పలకు నిప్పంటింతురు. ఆరనిచ్చి నిప్పంటించినను లోపచ్చిగలమ్రాకులగుటవల్ల నెండుకట్టెలవలె జ్వలితములు కావు. ప్రత్యేకము ఒకరిద్దఱుదగ్గరనుండి పొడుగైనదృఢమగుకట్టెలతో నవియెత్తి కాల్చుచుండవలెను. ఈకుప్పలు కాలి వాటిబూడిద మట్టిలో కలసిననేగాని పోడు ఫలించదు. పైన యెండ, యెదుట మంట, చుట్టునుపొగ, శక్తికిమించినపాటు, పాటుకుతగిన ఆహారలేమి, ఇవి మానవుని జీవనమున కెట్టిచేటొనరించునో, ప్రపంచస్వభావము నెఱింగినవారికి వివరింప నగత్యము లేదు. పోడుకాల్చుపని దానిపరిమాణమునుబట్టి వారంలగాయతు పదునైదురోజులవరకు పట్టును. వీరీరోజులలో ఒకకడవను జావతో నింపుకొని తమవద్ద నిడుకొని కడుపుమండినప్పుడెల్ల ముంతెడుచొప్పున త్రాగుచుందురు. దీనిం గాల్చుట బహుకష్టమైనపని. ఈవిధానము కిరాతులేగాని, సాధారణముగా అన్యు లవలంబింపరు. దీనిని కాల్చుట కుపక్రమించుచో యేనుఁగువంటి మనుష్యుఁడు పూర్తియగుసరికి పీనుఁగవలె తయారగును. వర్షముకురియఁగనే వీటినిదున్ని జొన్న చల్లుదురు.



కొండపోళ్లింకొకవిధముగా నుండును. కొండలయందు ఏటవాలగు, మట్టిగలప్రదేశములయం దీవ్యవసాయమును జేయుదురు. వీటిని దున్నుటకువీలుండదు. చివర సూదిగా చెక్కబడిన వెదురుపుల్లలను, మట్టిలోగుచ్చి ఆకన్నములందు విత్తులను నాటుదురు. కొండపోళ్లను, అడవిమృగములు మేయకుండా కాచుట బహుకష్టము. వాడి మొనలు గలపందు వెదురుబద్దలను మొనలు పైకుండులాగున చేనుచుట్టూ అలవబడి తెలవలె నమర్చుదురు. నోరవజేసి యేదైన మృగ మీఅలవను దాటఁబ్రయత్నించినను, పాతఁబడినబద్దలు పొట్టలో గ్రుచ్చుకొని చచ్చుటయో లేక చచ్చినంతపనిజరుగుటయో తటస్థించును. తెలుపురంగుపూసిన రాళ్లను చేని కన్నినైపులను అక్కడక్కడ నుంచుదురు. ఇదిగాక చేను మొలకలెత్తినప్పటినుండియు చేలో మంచె నమర్చుకొని, విడువకుండా పిట్టలను మృగములను అదలించుచుందురు. కొండపోటివ్యవసాయము తరుచు కొండలయందు నివసించు రెడ్లు అను తెగవారివలన జేయఁబడును. కోయలు అడవిపోడువ్యవసాయమును తరుచు చేయుదురేకాని కొండపోటివ్యవసాయము సకృత్తుగా జేయుదురు.

గవర్నమెంటువారు అన్‌రిజర్వులుగా నిర్దేశించిన

ప్రదేశములందును జమీందారీదుపాటిభూములలోను, వేస్టు (నిరుపయోగపు)భూములలోను, పోళ్లను కొట్టుదురు. క్లాసిఫైడు టింబరు నరుకఁగూడదను నిబంధన యున్నది కాని, అదియంతగా పాటింపఁబడుచున్నట్లుగాని, పాటింపబోవుటకై నిర్బంధింపఁబడుచున్నట్లుగాని యగుపించదు. ఒకపర్యాయము పోడునకై వ్యవసాయము చేసినప్రదేశము తిరిగి కొన్నిసంవత్సరములవరకు పనికిరాదు. అన్‌రిజర్వులలోగాని, దుపాటీలలోనగాని ఒక్కపర్యాయమైనను, పోడునరుకనిప్రదేశముండదనియే నానమ్మకము. ఏయుద్దేశముతో ప్రభుత్వమువారు రిజర్వుఅడవులకు సమీపమందు అన్‌రిజర్వుప్రదేశములను నిర్దేశించినారో, అట్టి అన్‌రిజర్వులన్నియు వ్యవసాయపుభూములుగా మారుచుండుటచే ప్రభుత్వపుటీప్సితము లీడేరకపోవుటయేగాక, రిజర్వునకు ఒత్తిడి కలుగుట తప్పనిసరియగును. ఇప్పుడుపేక్షించిన, కొంతకాలము గతించుసరికి, రిజర్వులోనికొంతభూమి అన్‌రిజర్వుగా మారవలసివచ్చుటయు నిప్పటి అన్‌రిజర్వులు వ్యవసాయయోగ్యపుభూములుగా మారుటయు, తప్పనిసరియగుట నిశ్చయము.

—* 19 లంక వ్యవసాయము *—

వీరును నదీమధ్యమందుండు భూములనులంకలందురు. అన్యప్రాంతములవారిచే పడుగైలంకలనివాడబడు భూములనుబాడవలని పిలువఁబడుభూములునుకూడ లంక అనియేయందురు. అన్నివైపులను, నీటిచే నావృతమై యుండునవి లంకలు.



నదిగట్టునకుఁ జేరియుండియు వరదకాలమందు వరదనీటిచే ముంపఁబడుపల్లపుభూభాగములు పడుగైలంకలు. వరదకాలము నందు వాగు ముఖద్వారమునుండి నదిలోని నీరు వాగులోనికెగపూనునంతనను వాగున కిరుప్రక్కలనుండు నేటవాలు ప్రదేశములే, వాగులంకలు. ఇట్టిప్రదేశము లన్నిటియందును వరదకాలమందొకవిధమగు మెత్తనిమట్టి చేరుచుండును. దీనినే వ్రెండ్రందురు. ఇందనేకరకములున్నవి కాని, వానిలో ముఖ్యమైనవి, ఇసుకవ్రెండ్రు, బురదవ్రెండ్రు, పెంకివ్రెండ్రు అనునవి. వరదకాలమందు ప్రవాహవేగమున, నిసుక కొట్టుకొనివచ్చుట స్వాభావికము. ఇట్లువచ్చుచున్నప్పుడు దానిగమనమునకు, మరియొకపదార్థమేదైన నడ్డుతగిలినచో నందుండు బరువగునిసుక దిగిపోయి, తేలికగుసన్ననియిసుకమాత్రమే, నీటితో కలసి తప్పించుకొని, పోగలుగును. ఇట్టితేలికయిసుక మఱొకమెఱక ప్రదేశమందు దగుల్కొని మేట వేయును. దిగిపోయినదానిని గండ్రయిసుకయనియు, తేలిపోయినదానిని నిసుకవ్రెండ్రుఅనియు నందురు. ప్రవాహవేగమునవచ్చుబురదనీరు, నదీమధ్యమందుండులంకలలోనిదుబ్బుగడ్డిచే నడ్డగింపఁబడుటవలన వేగముతగ్గి వెల్లువ తెక్కువకాకున్నచో నొకటిరెండురోజులు నిలుకడగా యుండుట తటస్థించును. అట్టుతరినీటిలోని బురద విరిగిక్రిందికి దిగి పోవును. ప్రవాహము తగ్గినవెంటనే, నీరు వెనుకకు పోయి బురద నిలువయుండును. ఇందుకొంచెమిసుకగాని, మట్టిగాని

మిశ్రమమైయుండినచో వ్యవసాయయోగ్యముగా నుండును. దీని నె బురదప్రొద్దుందురు. మట్టిగాని యిసుకగాని, మిశ్రమమై యుండని బురద గాలికి ఆరి యెండకు నెండి, తుదకు బీటలు వారి, పెంకులవలె పైకి లేచును. దీనిని పెంకిప్రొద్దందురు.

లంకలయందుండుదుబ్బుగడ్డిని వీరు కోయగడ్డియని యందురు దీని నాంగ్లమున నానల్ గ్రాస్ అందురు. దీనిని లంకవారు ప్రయత్నపూర్వకముగా పెంచుదురు. కొన్నిచోట్ల దానియంతటనదియె పెరుగును. ప్రయత్నపూర్వకముగా పెంచదలచిన వారిలో కొందరు వరదతగ్గినతర్వాత, బురదపాకుడుగట్టినస్థలములందుండుమట్టి దుక్కిచాలునకనుగుణ్యమగునంతపదునుగా నున్నప్పుడు, నాగలితో దున్ని నాగలిచాళ్ల వెంట కణుపులుగల దుబ్బుగడ్డి పుల్లలను పాతుదురు. దుక్కి పదునారుసరికి పుల్లలు వేళ్లుపారి కణుపులవద్దనుంచి యిలకలెత్తును. దుక్కిచాలున దుబ్బునాటు విధానమిదియె. దుబ్బుపుల్లలను దెచ్చి వరుసలు ప్రకారము పాతి, నాటుకొనువఱకు నీళ్లుపోయువిధానమును మఱికొంద ఱవలంబింతురు. దీనిని నూత్నవిధానమందురు. మఱి కొందఱిసుకప్రదేశములందు చిన్నచిన్నగోతులను త్రవ్వి ఆగోతులయందు దదవముగా తెచ్చినమరికొంతమట్టిని జేర్చి ఆమట్టిపైన, కణుపులుగలదుబ్బుపుల్లలను, అడ్డదిడ్డముగా వేసి తిరిగి మట్టితోఁగాని, ఇసుకతోఁగాని, నాగోతులందుండుపుల్లలను కప్పుదురు. కొన్ని రోజులగుసరికి గోతులలో కప్పఁబడినపుల్లలు మట్టి



లో వేరు దొడిగి, భూమిమీఁద నన్నివైపులను తీఁగవలె ప్రాకును. అట్లుప్రాకుటలో నేలనానినప్రతికణుపును తిరిగి వ్రేళ్లుపారి యిలకలెత్తుచుండును. దీనిని కొండదుబ్బని యందురు. కొందఱిట్టి దానిని ప్రాకుడుదుబ్బనికూడయందురు. దుబ్బుగడ్డి వేసవికాలమందు పుష్పించును. దీనిపువ్వు గాలికెగిరి పడి వర్షముకురియగనే మొలకెత్తును. ఇట్లు మొలకెత్తినదానిని ఊసడమని యందురు. దానియంతట నదియె పెరిగినదానిని ప్రయత్నపూర్వకముగా పెంచినదానిని సులభముగాను కనుపట్టవగును. ఊడ్చి పెంచిన దుబ్బునకు చుట్టునుబుట్టినక్రొత్తకాడలను వేరుజేసిన మొట్టమొదటనాటిన మధ్యభాగమునందలి కాడస్పష్టముగా కనుపించును. కొండదుబ్బైన దుబ్బుపైభాగమును కోసి యదుగుపెల్లగించిన ఆదిని అడ్డదిడ్డముగాపాతినపుల్లలు కన్పట్టవగును. నాగటిచాలుననాటినదుబ్బైన అంటినకుదుళ్లు వరుసతప్పక తీర్చినపంక్తులవలె కనిపించును. దానంతటనదియె పెరిగినచో కొన్నిచోట్ల చొరనలవికానంతదట్టముగాను, మఱికొన్నిచోట్ల నాటియునంటనట్లును నగుపించును. దానియంతట నదియే పెరిగినయెడల ప్రయత్నపూర్వకముగా పెంచినదానియంత యనుకూలముగా నుండదు. వీరికి లంకలను పెంచి వాటిఫలిత మనుభవించుటన నేమియో యెఱుంగరు. దుబ్బుగడ్డి ప్రవాహవేగము నాపగలుగును. నీటివాలును మరల్చి మఱొకమార్గమున ప్రవహింపఁ జేయఁగలుగును. లంకను పెంచుట కుపయోగించును. పశువు

లు మేయ మొదలిడిన వృద్ధినొందదు. అరణ్యప్రదేశములందు విస్తారము వాగులుండుట సహజము. వాగులగుండా ప్రవహించుచునీరు రాలినట్టిన్ని కుళ్ళినట్టిన్ని ఆకలములతోను కాలిన చెట్లయొక్క బూడిదతోను కలిసి వాగునకిరుప్రక్కలనుండు పొలములపై పొర్లి ప్రవహించుచుండును. ఇట్టియెరువు నీటి కపారమైన సత్తువ జేయును. వేసవికాలమందు దైవికముగాను బుద్ధిపూర్వకముగా కొండలు, అరణ్యములు నిప్పంటుకొనుచుండుటచేత తగులబడుచుండును. కాలినకొండలు కాటుకమసిఅలదిన కొండలవలె నుండును. ఇట్టికొండలయందలి కాలినబూడిదె వర్షకాలమందు వాననీటితో కలిసి కొట్టికొనివచ్చి వెల్లువనీటిరంగును మార్చుచుండును. ప్రవాహమునందలి నీటిరంగునుబట్టి వర్షమెప్రాంతమందు కురిసినది వీరు సులభముగా చెప్పగలరు. వరదకాలమందు గోదావరిలోని నీరొకప్పుడు నల్లగాను, మరొక్కప్పుడు తెల్లగాను, కొన్నిసమయములయందు పసుపు, ఎఱుపు రంగులుగల బురదగలదిగాను ప్రవహించుచుండును. వీరు నదికి క్రొత్తగా నీరుతగిలినదనుటకు బదులు కమ్ము తగిలినదందురు. కమ్ముతగులుటయన క్రొత్తగా నీరు తగిలినదని వీరియభిప్రాయము. ఇసుకవ్రొండులంకలు బురదవొండులంకలంత సారవంతమైనవి కావు. వీటియందు ఆముదము, బొబ్బర, పులవమొదలగుపైర్లను చల్లుదురు. ఇసుక మిశ్రమమైయుండు బురదవ్రొండునేలలందు అన్నిరకములపైర్లను



పెట్టుదురు. సత్తువైన మట్టిలేనిమెరకలంకలందు జొన్న చల్లుదురు. క్రొత్తగా వ్రొండువేసిన మన్నుగల పల్లపులంకలందు పొగతోటలను నాటుదురు. ఇట్టివాటిని వెల్లడిదేశస్థులు పుటలంకలందురు. వాగులంకలనబడు స్లోపులందు దున్నవీలుగానుండుచోట్ల దున్ని, పొగతోటలుగాని, మిరపతోటలుగాని వేయుదురు. దున్నవీలుగానట్టియు, పచునారనట్టియు ప్రదేశములందు పెసర, మినుము, ఆవాలు మొదలైనవి దూకుచల్లిక చల్లెదరు. దున్ననవసరము లేకుండా బురదమీద గింజ నాటుకునేవిధముగా చల్లువిధానమును దూకుచల్లిక యందురు. వీరి కిట్టిభూములసారము ననుభవించుటకు అవసరమగు ప్రోత్సాహముగాని, ద్రవ్యసహాయముగాని లేదు. ఇట్టిప్రదేశములన్నియు చాలవరకు వెల్లడినుండి వలసవచ్చినవారి స్వాధీనములో నుండియున్నవి. కోయలకు వాటిరుచి మప్పినచో వలసవచ్చినవారు తిరిగి యింటికి మరలుటకు మార్గమింకొకరు చూపనగత్యముండదు.

## —*20 వేట*—

కోయలకు వేటయందెక్కువ ప్రీతి. వీరు మాంసమున్న అన్నమపేక్షింపరు. వేటలమకమునున్నపు డితరవ్యాపకము లెంతప్రాముఖ్యములైనను లక్ష్యపెట్టరు. వీరు సాధారణముగా వేటాడుటకు, తాడు తుపాకులను, ఉండ విల్లుబద్దలను ఉపయోగింతురు. పిట్టజాతులను వేటాడుటకు పుచ్చులను —

న్నదురు. కముజు, పూరేడు, డేగ, ఈపక్షులను మచ్చికజేసి, వాటిసహాయమునకూడ పిట్టలను వేటాడుదురు. వీరు తుపాకులను స్వయముగా తయారుచేసుకొందురు. తుపాకిమందుపాళ్లను కూడ వీరువేసుకొని, కలుపుకొనగలరు. మందుపాళ్లను తూచుట కొకవింతత్రాసు వీరివద్ద నుండును. దానితో తూచుట సాధారణముగా అందరికిని చేతకాదు. తూనికరాయినుంచుటకు, దండికొకవైపు నొకచిక్కమును, మందుంచుటకింకొకప్రక్క నొకచిప్పయును ఉండును. దీనిని తరుచు ఉపయోగించువారలెగాని, అన్యులకు సవ్యముగా చేతితో పట్టుకొనుటయైనను తెలియదు. సీసమునుకరగించి గుండ్లను పోతపోయుదురు. సీసముదొరకనియెడల, ముక్కముక్కలుగాఁ గొట్టినయినుపముక్కల నుపయోగింతురు. విశ్వకర్మలుపయోగించు వ్రాదుడుగొట్టములనే వీరు తమచేతతుపాకీలకుపయోగింతురు. వింటిబద్దయున కాపడిబద్దవలె నుండును. కాని, అంత మోటుగా నుండక నాజూకుగా నుండును. బద్దవంచినప్పుడు పేడులేచిపోకుండుటకుగాను, బద్దకు అక్కడక్కడ జిగితరమగు నారతో కట్లనుకట్టుదురు. వింటిబద్దకు సంధించికొట్టుటకుపయోగించువాటిని అంబులనియు, లొద్దెలనియు, ఉండలనియు నందురు. అంబులన, నడుమ గొట్టమువలెనుండునట్టికోణములు వాడిగాజేయబడిన, త్రికోణాకారములగుయినుపరేకుముక్కలు ఈరేకునకు మధ్యభాగమునసుండు గొట్టమునందొక, గుండ్ర



ని వెదురుబెత్తమునుగాని, లేక బెత్తమువలెచెక్కబడిన బద్దచీలికనుగాని, జొనుపుదురు. బెత్తముయొక్క రెండవకొనను, పక్షియీకలనమర్చెదరు. ఇట్టియంబును, నేదైనమృగమునుద్దేశించిసంధించినప్పుడు గురితప్పకుండ పోవుట కీవెంట్రుకలుపయోగకారిగా నుండునందురు. అంబుగొట్టమందమర్చబడిన చువ్వ జారకుండులాగున, సన్ననిజిగితరమగునారతోగాని, తోలుదారముతోగాని చుట్టి బిగింతురు. ఈకట్టు శీతోష్ణస్థితులననుసరించి బిగువుగాని, వదులుగాని కాకూడదు. లొద్దెలనవి గట్టి వెదురుకర్రముక్కలు. ఇవి మనదేశపు అవాయిజువ్వలవలె నుండును. తారాజువ్వకు మొనటియందు గుల్లగానుండు గొట్టముండను. దీనికిఅట్లుగాక, జోలుండని, గట్టిముక్కఅమర్చబడియుండును. మృగజాతులను వేటాడవలసివచ్చినప్పుడు అంబులనుపయోగింతురు. పిట్టజాతులలో పెద్దవాటిని మృగజాతులలో చెవ్రలపిల్లి మొదలగువాటిని చంపుటకు లొద్దెలనుపయోగింతురు. తదిర అల్పజీవులన్నిటి వుండలతో కొట్టుదురు. మృగముయొక్క దార్ఢ్యమునుబట్టియు, తగిలినప్రదేశమునసుసరించియు యింకను అవసరమునితోచిన, నొకటికంటె యెక్కువగా నంబులనుప్రయోగింతురు. అంబులు శరీరాంతర్భాగమునందుజొచ్చి లోనిపేగులకుతగుల్కొని, సులువుగాబయటిరా నలవిగాకుండును. గుచ్చుకొనువైపునుండు రంధ్రముకంటె, వెలుపలికివచ్చువైపునుండు రంధ్రము పెద్దదిగా నుండును. వీటిచే వేటాడ

బడినమృగము బాధనొందనిదే చావదు. గుచ్చుకొన్నఅంబు బయటికిరాక, బాధపెట్టుచుండుటచే, దెబ్బతగిలినమృగము, బెదరిపారిపో మొదలిడినప్పుడు త్రోవ కిరుప్రక్కలనుండు రుప్పలకాయంబుదగుల్కొని, గాయమును పెద్దదిగాజేసి, ఆమృగమును అమితమగుబాధనొందింపజేయును. పిచ్చినదానివలె అడవియంతయు ద్రిమ్మరిద్రిమ్మరి, తుదకు యెచ్చటనోపడిచచ్చును. పఱుగెత్తినఅడుగులజాడనుబట్టియు అడుగులజాడనుబట్టి గుర్తించుటకువీలులేనిచోట్ల దీనినితినుటకు పైనెగురుచుండెడి పక్షులసంచారమునుబట్టియు గుర్తించుదురు. రాగిడిమట్టిఫ్రుండలను కూడ వింటికిసంధించి, ప్రయోగించెదరు. ఫ్రుండదెబ్బ సరిగా ఆయువుపట్లను తగిలినమనిషినైనను నవలీలగా చంపును.

అరణ్యసంచారముచేయు ప్రతి కోయవానివద్దను వింటిబద్ద, అంలులపొది, గండ్రగొడ్డలి, చేకత్తియు తప్పకవుండును. ఇవి వెంటలేనిదే వీరు ఒంటరిగా సంచారము చేయరు. ఇవి వీరిఆత్మను సంరక్షించుటయెగాక, ఉదరపోషణార్థమగు అహారమునుకూడ సమకూర్చును. వీరివెంట నీయాయుధములున్న యెట్టిమహారణ్యములలోనైనను నిశ్చయముగా సంచరింతురు. వీరి మొలగుడ్డమూటయం దించుక పొగాకున్న, తలగుడ్డమూటయం దించుక కారమున్న వున్న యెన్నిదినములైనను యడవివదలి బయటికి రారు. మార్గమం దెందైన మృగముగాని, పిట్టగాని కంటికగుపించిన దానిని వేటాడి తినుచు సంవ



త్సరములకొలదిని కాలము యథేచ్ఛగా గడుపగలరు. వీరు క్షుత్పిపాసలను దీర్చుకొనువిధాన మతిచిత్రముగానుండి, ఆర్యసంతతిజీవితమును జ్ఞప్తికి తెచ్చుచుండును. అడవియం దేదైన నొకపిట్టగాని, మృగముగాని తటస్థించినదానిని వేటాడిచంపును. దానిశరీరమందలి బహిరంతర్భాగములయందుండు భోజనానర్హములగుభాగములను వేరుజేసిభుజ్యమానములగు భాగములనొక వెదురుగొట్టమునందిమిడ్చిగొట్టమునకుచీలబిగియించిదానిపై నెండుచితుకులను బేర్చిపుల్లపైనింకొకపుల్లతోరాశి నిప్పుపుట్టించినిప్పంటుకున్నపుల్లనాయెండుచిదుకులందుంచి రగల్చిమంటజేయుదురు. తుదకది రాజి ప్రజ్వరిల్లును. అట్టిమంటలో గొట్టమునందిమిడ్చినమాంస ముడికినదని తోచినతర్వాత దానినందుండి వెలికిదీసి చల్లార్చి కొంచెము కార మద్దుకొని భుజించి క్షుద్బాధను దీర్చుకొందురు. అటుతర్వాత సమీపమందుండు సెలయేటికరిగి యందలి నిర్మలోదకమును తనివిదీర ద్రావి పిపాసావిముక్తు లగుదురు. వీరి కీపనిని నిర్వహించుట కొకత్రుటియైనను పట్టదు. నేనొక యడవియందు ప్రయాణముచేయుచుండగా మార్గమధ్యమందు వర్షమువచ్చినందున తడిసిపోతిని. బట్టలన్నియు నానిపోవుటచే వడకనారంభించితిని. అంతట నావెంటనున్న కోయవాడు నాస్థితికి జాలినొంది తనచేతనున్న గండ్రగొడ్డలితో కొన్ని పలవలకర్రలను నరకి తెచ్చి వాటితో నొక మూరెడెత్తుగల పందిరి నిర్మించి, దానిపై రెండుకర్రలను, తడ

వని చెట్టుబెరళ్ళను పరచి రెండుపుల్లలను తెచ్చి నొకదానిపై నింకొకదానిని రాపాడించి నిప్పునుపుట్టించి పందిరిపైనున్న యెండుచితుకులకు నంటించి రగులునట్లు చేయఁగలిగెను. రాజుచున్న పుల్లలున్నపందిరికి మూరెడెత్తుపైగా నుండులాగున పాకవలెనుండు మఱియొక పందిరి నమర్చెను. పాకవలెనమర్చిన పందిరి చెట్లయాకులనుండి జారు వర్షపుచినుకులను పందిరిమీఁద నుండుచున్న చితుకుల నారిపోకుండ జేయగలిగెను. మొదటవేసినపందిరి క్రిందనుండి ప్రవహించు నీటికిని అగ్నిహోత్రమునకును సంబంధము లేకుండ జేయగలిగెను. ఆనాటిరాత్రి హోరుగాలితో వర్షముచే తడిసి గడగడవడకుచు నిల్వ నీడలేని మహారణ్యమధ్యమందీ యగ్ని హోత్రమే లేకున్నచో యీపాటి కీలోకమును వదలియేయుందు ననుటలో నాశ్చర్యమిసుమంతయు లేదు. మన మల్పజ్ఞులనువారియందెంతశక్తి నిబిడీకృతమైయుండునో వారి ప్రజ్ఞావిశేషములెట్లుండునో తెల్పుకొనుట కింతకంటె వేరుతార్కాణిక మనవసరము. వీరికి ఉప్పుకారము, పొగాకు మన మందజేసిన మనకు అడవియందేది కావలెనన్నను తెచ్చియిచ్చెదరు. ఇట్టిస్వేచ్ఛాజీవితేచ్ఛలగు కోయలను దాస్యవృత్తికలవడజేయుట కెంతయోకాలము పట్టును. కాని, సులభసాధ్యముకాదు. వీరివద్ద వేటకుక్కలు గూడనుండును. ఆడువాటికి గొడ్డుబోతుమందును బోయుదురు. ప్రతిదానికిని శైశవావస్థయందె పశిమందు పోయుదురు. వీరి



సహాయముచే కుందేళ్ళు, ఉడుములు, పందులు మొదలగువాటిని వేటాడుదురు. దుప్పులు, కణుసులు, మనుబోతులు, పందులు మొదలగువాట్ల ఉనికిపట్లను పశిబట్టి కనిపెట్టి తమ యజమానున కాజాడ తెలియఁజేయును. వీరికి వేట వంశక్రమానుగతమగు జీవనోపాధియై యున్నది. క్రూరమృగములను కట్టుబాట్లలోనుంచుటకు వీరియొద్ద నేదో మంత్రముండునని కొందరందురు కాని, యిది వట్టికల్ల. మనయిండ్లయందుండు పోట్లఆవులు, కాట్లకుక్కలు మననుకఱవక అన్యులజోలికి పోవుటకుమన మెట్టిమంత్రమును పఠింతుమో వారును వాటివలన భయములేకుండుట కట్టిమంత్రములనే ఉపయోగింతురు. పదిపన్నెండు గూడెములవా రొక్కచోట జేరి, కొండదోలి వేటాడుదురు. ఒకవైపునుంచి కొందరుతోలుచుందురు. మరొకవైపున కొందరు కొట్టుటకై కాచియుందురు. వీరిఆయుధములు నవీనాయుధములవలె నుండవు కాని, చేయుపనిమాత్రము సమానముగానే యుండును.

వీరిచేపలవేట యితచోట్లవలెగాక, ఒకవిచిత్రముగా నుండును. నీరెండిపోవుచున్న చెర్వులలోను, లోతులేని నీరుగల మడుగులలోను, రాత్రిభాగమందొకజాతిచెట్టుబెరడును తెచ్చి కలుపుదురు. అందున్నచేపలన్నియు మరుచటిరోజున చచ్చి తేలును. వాటినేరితెచ్చుకొని యెండబెట్టి కాల్చుకొనితిందురు. మొలబంటిలోతునీళ్లలోదిగి, తమకట్టుబట్టలనే వలలకుప్రతి

ష్ఠాగానుపయోగించి, పెద్దపెద్దచేపలనుకూడ, పట్టుకొందురు. కాని అట్టివాటిని, మామూలుగా పచనముచేయరు. పెద్దచేప దొరకినయెడల దానికి బురదమట్టిని పూసి యిసుకలో పూడ్చి దానిపైన యెండుచితుకులతో మంటవేయుదురు. లోనున్న చేపవుడుకుటకు తగినంతమంట తగిలినదనితోచినప్పుడు పైమంటనార్పి, యిసుకనొత్తిగించి, చేపనుపయికిలాగుదురు. మట్టిపూతగలిగినచేప నొకచివర వ్రేలాడబట్టుకొని, పైపూతను ఒకచిన్నకఱ్ఱముక్కతో దుల్లగొట్టుదురు. పూతమట్టియు చేపపైనుండుపొలసును రాలిపోవును. అట్టిదానిని చిన్నచిన్నముక్కలుగాచేసి కారమలముకొని తినెదరు

—* 21 పిట్టల వేట *—

వీరు పిట్టజాతులను వేటాడుటయందనేకవిధానముల నవలంబింతురు. నెమళ్లు శనగచేలకాలములో భూమిమీద మేతకువచ్చును. మంచుకురియుకాలమందీచేలు కాపుమీద నుండును. శనగ, రేవడినేలయందు పైరగును. మంచుకాలమం దీచేలయందివి మేతమేయునపుడు, వీటిపృచ్ఛములు నేలపై నానును. చేనిలోని రేగడిమట్టి జిగురుగానుండు స్వభావము గలదియగుటచే, నడుచునప్పుడు యీకప్పలు బడుచుండువాటితోకలకామట్టి అంటుకొనును. కొంతసేపిట్లంటుకొనిన తుదకు పైకెగరలేనంత బరువుగా మందగట్టును. యిట్టిస్థితి



లోనివియుండగా, చుట్టుపట్లనుండు కోయలాసంగతికనిపెట్టి, వాటినికఱ్ఱలతో మోది చంపితినెదరు.

ఒకవిధమగు పంగలకఱ్ఱకొక వుచ్చునుపన్నుదురు. దానికి ఒకకీటకమును వ్రేలాడగట్టుదురు. దానిని తినవచ్చినపిట్ట తల యీయుచ్చునందు దగుల్కొని వెడలలేకపోవును. అంతట దానిని పట్టిచంపుదురు.

చీకటిరాత్రులయందొక కళ్లబుట్టయందొక దీపముంచి దాని నొకబుర్రదోనెయందిడుకొని, ఒకచేతితో గంటవాయించుచుందురు. చిలువజాతులను పిట్టలు, శబ్దమునువినుటకు దీపముందుచోటికివచ్చును. వెంటనెవాటినిబట్టుకొని కాళ్లువిఱిచి, మెడలునులిమి, బుట్టయందిడుకొందురు.

పిట్టలుండు చెర్వునందు రెండుమూడుకుండలకు తూట్లొనర్చి, వాటికిసుద్దబొట్లనుర్చి, చెరువుమధ్యభాగమునందు బోర్లగించి, తేలబెట్టెదరు. అందుండుపిట్టలొకటిరెండురోజులవరకు, వాటినిసమీపింపవెఱచునుగాని: తర్వాత వాటివలనభయకారణమగుపింపమిచే, సమీపించి, పైకెక్కిదిగుచుండును. యిట్లలవడువరకు వేచియుండి, మరునాటివేకువఝామున, ఒక డాకుండయందు తనతలదూర్చి, తదితరఅవయవములు నీటిలోనుండి పైకికన్పించకుండులాగున, కుత్తుకబంటి నీటిలోనుండి, ఆకుండ నాపిట్టలుండుతావునకు మెల్లమెల్లగా త్రోసికొనిపోవును. సమీపమందుండుపిట్టలను, కుండతూట్లగుండాకన్న

ట్టి, నీటిలోనుండి వాటికాళ్లనుబట్టుకొని దిగలాగి మొలకు
కట్టుకొన్నతాటికి ముడివైచుచుండును. యీవిధముగా దొరికి
నన్నిపిట్టలను పట్టుకొని, మొలనున్నతాటితో తోరణముగా
గట్టి యింటికిచేర్చును. ఇట్టిచిత్రవధలెన్నియో వీరాచరింతురు.
వీరు యిందువల్లనె కిరాతులనబడుదురు. వీరుసార్థకనామధేయు
లనుట కింతకంటెవేరునిదర్శనము లనవసరములు. వీరికి గొఱ్ఱె
గేదెలవేట చాలయిష్టము. వీరుదానిని వేటాడబోవునప్పుడు,
మద్దిచెట్లపైనుందురు. వీరుకొట్టుదెబ్బలకు వీరిని చంపవలెనని
అదిచేయు, క్రోధానలపూరితమగు చర్య సహకారియై
యసురులను గొనగలుగును.

## —* 22. గ్రామము. *—

రెండుతాటిచెట్లును, నాలుగుయిప్పచెట్లును గలచోట
నొకగూడెమును కట్టుదురు. నూతనముగా గ్రామము కట్టబో
వుటకుముందు ఆతెగలోని కులపెద్ద గ్రామమునకై నిర్దేసింపఁ
బడిన స్థలమందు మూడురాత్రులు వొంటరిగా నిద్రించును.
తొలినాడు దుస్వప్నములేమియు రాకుండవలెను. మలిరోజున
కొన్నినూకల మొకకుప్పగా బోయును. వాటిని చీమలు ముట్ట
కుండవలెను. మూడవదినమందు కొన్నిగుడ్లను పొదుగబెట్టు
దరు. అందలిగ్రుడ్లవిసిపోకపిల్లలు కావలెను. ఈమొదలగు ని
దర్శనములకు నిలువఁబడినతరువాత వారి కులవేల్పును నిలువఁ
బెట్టి, దానినారాధించి, కట్టబోయ్యే గ్రామసరిహద్దులందు దా



వతను దిగ్బంధించెదరు. గూడెములు పట్టణములవలె తీర్చి కట్టి
నట్లుండక చెల్లాచెదరుగా కట్టుకొన్న యిండ్లు కలవిగా నుండు
ను. శాశ్వతములైన కట్టడములవలెగాక తమకయిష్టమున్నప్పు
డనాయాసముగా మరియొకచోటికి మార్చదగినట్లుండును.

## —* 23. గృహనిర్మాణము. *—

వీరికి గృహనిర్మాణమునకు వ్యయమేమియు నుండదు.
గూడెములోని యిండ్లన్నియు నూడబెరికిన ఒకయిసుపమైన
నను ఉండదు. పరుశురామప్రీతియగుట తటస్థించెనేని ఆనవా
లునకైనను నేమియు మిగులదు. ప్రతిసంవత్సరము వరదభ
యమగుటచే స్థిరమగుగోడలపైన శాశ్వతమైన యిండ్లను
కట్టరు. వరదపట్టు ప్రదేశములయందు యిండ్లు కట్టుకొను ప్రజ
ల యిక్కట్టులు వర్ణనాతీతములు. వూరి కిరుప్రక్కలనుండు
వాగులలోనుండియు తదితరపల్లపు ప్రదేశములనుండియు, నది
నుండెగబొడిచిన నీరు వూరును చుట్టవేయును. నీరు యింకను
యెగబొడుచుచున్నదని తోచినప్పుడు తమసామానుల నటు
కలపై కెక్కించి, యింటికొక్కరుచొప్పున, పైకప్పునందుండి
కాయుచుందురు. నీరింకను, పైకప్పంటిననితోచిన, తమసామా
నులను సంగళ్లపైనెక్కించి, మెరకప్రదేశములకు వెడలుదురు.
వీరిండ్లను, మొకరములపై కట్టుదురు. పాతినమొకరము
లు చీకకుండుటకుగాను, గోతులయం దినుకబోయుదురు.
మొకరములపై దూలమునమర్చుదురు. కుటుంబమునుబట్టిన్ని,

గృహస్తునికలిమినిబట్టిన్ని, 2 మొదలు 4 వరకు దూలములయిండ్లను కట్టుదురు. దూలములమర్చినతర్వాత, వాటిపైన, పందూ వెదురుబద్దలతో అటుకతడిక నొకదానినినల్లింతురు. ఇదిమన వయిపుయిండ్లకుండు సొరంబీ (Cealing) వలె ఉండును. సాధారణముగా ఆసంవత్సరమందె కొట్టినకలవనుపయోగింపరు. క్రొత్తదైనత్వరలో పుచ్చి నశిరాలును. పోక్లునరుకుకాలమందిందుకుపయోగించు కలపనువారు జాగ్రతజేసియుంచుదురు. మొకరములకు మధ్యమందుండు రాటను, నిటాడిందురు. మున్ముందు నిట్రాడు నాధారముగా జేసి వాసములమర్తురు. వీటిని తల్లివాసములందురు. యివితదితరవాసములకంటె కొంచెము దృఢముగానుండును. సామాన్యులన్యవాసములకు వెదుళ్లనుపయోగింతురు. ఇతరవాసములను తల్లివాసములపై నాధారపలచి, కట్లతోఁబిగించెదరు. వాసకూర్పు ముగిసినతర్వాత, కూర్చినవాసములు తమతమస్థానములు తప్పి జారకుండులాగున పెండెకట్టువేయుదురు. పెండెకట్లకుయితరచోట్లవలె నారనుగాక ఒకవిధమగుతీగె నుపయోగింతురు. ఇదినారకంటె చాలదృఢముగానుండును. ఇదిగాక తబిసి, ఆరి, కిత్తనారలు కూడ నుపయోగింతురు. వీరిండ్లను గడ్డితో నేయుదురు. చీపురు, కోరు, ఆవిరిగడ్డి జాతులుపయోగింతురు. కోయగామిగిలిచ చొప్పదంట్లతోను, తీసిపారవేసిన చెత్తతోకూడ నేసికొందురు. ఇట్టినేతకుపయోగించుగడ్డి, యింటివానిస్థితిగతులననుసరించియుండును. తాటియాకులనేత, యీప్రాంతవాసులకంతగా తెలియదు. పయిభాగమీదీవిధముగా కప్పేర్పర్చుకొని అటుతర్వాత క్రిందిభాగమునందు మరుగేర్పర్చుకొందురు. వెదురుబద్దలతో గాని, అడవిబడితెలుతో గాని, వావిలికంపలతో గాని, అల్లినతడికెలను యింటిచుట్టుగోడలకు బదులు, అమర్చుకొందురు. వీటిపైనటుతర్వాత మట్టితో పూతపెట్టుదురు. కొందరు ఈకుఆకులను కుట్టుకొందురు. వీరిండ్లకు తలుపులుద్వారబంధములుండవు. వెదురుబద్దలతో అల్లినతడికెలనేతలుపులుగా నుపయోగింతురు. మానుతలుపులయందభిలాషగలవారు, పాడిపసువులను, గిత్తలనుయిచ్చి కొనుక్కొందురు. వీరికి కావలసినకలప కొననవసరముండదు. వెదురుకుమాత్రము వందకెనిమిదిఅణాలచొప్పున శీనియరెజీయివ్వవలెను. చీపురుగడ్డికి బాడికి 0–5–0లు. మనిషిపిడికిలియందిముడునంతేసికట్టలు రూపాయి 1 కి ల 45 వందలవరకు యిచ్చెదరు. చీపురుగడ్డితో నేయబడినయిల్లు శీతకాలమందుష్ణముగాను, ఉష్ణకాలమందు చల్లగానువుండుడును. ఆవిరిగడ్డితో నేయబడినదైన శీతకాలమందు శీతాధిక్యతను ఉష్ణకాలమందు ఉష్ణాధిక్యతను, యిచ్చును. కోరుగడ్డితో నేయబడినయింటియందు, దారుణమైనఉష్ణము చేయుగుణముండును. కోరుగడ్డితో నేసినయిల్లు కొనసాగదనుసామెతగలదట. శీతకాలమందు ప్రతియింటిముందొక నెగడి యుండును. యీనెగడియేలేకుండుచో, యీపూరియిండ్ల

యందు నివశించియుండు జీర్ణకౌపీనధారులగు వీరిబాధలెల్లుండెడిచో పరమేశ్వరుని కెరుక.

—। నీటి వసతులు. ।—

గోదావరియొద్దనుండువారు గోదావరినీటినుపయోగింతురు. గ్రామము యేటి ననుసరించియున్నను, ప్రవాహవేగము దూరముగానుండు గ్రామములవారికి యేటినీటిసదుపాయము బ్బదు. నదినీరు దొరుకనివారు వాగులలోని వూటనీటినిన్ని నదిలో అక్కడక్కడనుండు మడుగులలోని నీటినిన్ని పానీయార్థ ముపయోగింతురు. ఎండలతీక్షణ మధికమైనకాలదిని మడుగులలోని నీ రెండిపోవుచుండును. కొన్నాళ్ళగుసరికి పూర్తిగా యెండిపోవుటకూడ కలదు. వూరిపశువులన్నియు యిట్టిమడుగులకే నీరుత్రావవచ్చును. అట్లు నీరుత్రావవచ్చిన మందలలోని పశువులు మలమూత్రముల నామడుగులోనె విసర్జించుచుండును. ఇట్లు కొంతకాల మగుసరికి మడుగులలోనినీరు పురుగుపట్టి దుర్వాసనగొట్టుచుండును. వీటిలోనినీరు పానీయానర్హమైనప్పటినుండియు యిసుకయందు చలమలనుతీసి అందూరు నీటి నుపయోగింతురు. నదియొక్క గట్లెత్తగుటవల్ల ప్రవాహము గట్టునకు సమీపమందున్నను మంచితెచ్చుకొనుట బహుకష్టముగానుండును. గట్టెక్కుట కొంచెమించుమించు నిచ్చెనెక్కుటయే. ఒక్కొక్కచోట 50అడుగులవరకు యెత్తుండును. వర్షకాలమం దిట్టిచోట్లనుండి నీరు తెచ్చుకొనవలసి



వచ్చు వీరిపాట్లు దైవమున కెఱుక. వాగులయందు సదాఊట నీరు ప్రవహించుచుండును. పలురోగముల పాల్పడువారీనీటి నుపయోగించువారలే. వరదకాలమునందు, నదిలోనిప్రవాహవేగము, వాగునందూరు నీటిని, లోనికి జొరనీయనందున, నొద్దదరే ప్రవహించుచుండును. వరదకాలమునందు, ఏటియొద్దనుండు వారలకు లభ్యమగున దీ యూటనీరే. ఇది ఆకులములు కుళ్ళిన కల్మషోదకము.

వీటిలో కొన్నిటియందూరునీరు, కంటికి ఆనందముగానుండి, త్రాగుట కింపుగానుండును. తనివిదీర ద్రావిన, విడిపించుకొన నెంత ప్రయత్నించినను, విడువని రోగమావహించును. నిర్మలోదక పూరితములగు తటాకములుగాని, పానీయకూపములగు నీరూరు నూతులుగాని లేవు. వీరు తరుచు తమ గూడెముల సమీపమునందుండు వాగులలో చలమలనుదీసికొని, వాటియందూరు నీటిని ద్రావెదరు. వీటియందూరు నీరు చిక్కగా జిడ్డుగలిగి, మడ్డిగానుండును.

—* 25 దీపములు. *—

వీరుదీపములతరుచునుపయోగింపరు. అడవియందుసంచారము చేయువారలు చేతి యందొక కొఱకంచు నిడుకొనెదరు. మరికొందఱు కొన్ని పుల్లల నొకకట్టగా గట్టి, దానికి నిప్పంటించుదురు. దానినే జూజాయికట్టందురు. ప్రతియింటి యందొక నెగడియుండును. దీని సహాయమున, జీకటియందు వీరు

తమపనులను నిర్వర్తించుకొందురు. కిర్సనాయిలు నక్కడక్కడ సకృతుగా నుపయోగింతురు. ఆముదమును వండుకొందురు. ఇప్పగింజలనుండి తీయబడిన చమురునుగూడ నుపయోగింతురు. ఇవిసమృద్ధిగా దొరుకనప్పుడు, నులిపుచ్చ అను బల్ రక్కసిచెట్లనుండి రాలగొట్టబడిన గింజలనుండి చమురుతీసి దానినుపయోగింతురు.

26 ప్రేతభూములు. దహన, ఖనన, సంస్కారవిధానములు.

చచ్చినవాండ్లను పాతిపెట్టుటకై త్రవ్వబడు గోతులలోతుగానుండవు. వరదకాలమందు శవములనుప్రవాహవేగమునందు విడిచిపెట్టుదురు. నదిగట్టునను వాగుఒడ్డులందునునుండు నెరదలలోవేసి, నెరద కిరుప్రక్కలనుండు గట్లను విరుగగొడిచి విరుగబడిన మట్టితో కప్పుదురు. ఇట్టి నెరదలను వ్రెరెలందురు. వరదలేని కాలమందిసుకతిప్పలయందు కప్పిపెట్టుదురు. గూడెములయందుండు వారు పొలిమేరలను ప్రేతభూములుగా నుపయోగింతురు. సారాయి లేనిదే శవ మిలు వెడలదు. చచ్చి విచారించుచున్నను, సారాయి సప్లయిచేయుటలో శ్రద్ధవహించినదె తరువాతి కర్మనడువదు. సారాయి సమృద్ధిగానుండిన కులబంధువులు కుప్పతిప్పలుగావత్తురు. మనలో డోలు సన్నాయి వాయిద్యమెట్టిదో, వీరిలో సారాయివాసనయట్టిది. వీరి శవమునకు వాహనము మంచమే. లేకున్న చాపకుచుట్టి, ఆచుట్టనొక కర్రకుగట్టి పాఱవేయుదురు.





—*27 అ ప ర క ర్మ *—

వీరిలో నెవరైనను చనిపోయినప్పుడు వాని మందలోనుండు మంచియావునుచంపి దానితోకను చచ్చినవానిచేతియందిడెదరు. దానిమాంసమును వండి కొంచెము జొన్నకూటితో పాటిమాంసపుముక్కలను వానిముఖ్యబంధువులకును, స్నేహితులకును, బంచిపెట్టెదరు. ఉడికినజొన్నలను జొన్నగుల్లలందురు. తరుచు అపరకర్మయందీజొన్నగుల్లలనేయుపయోగింతురు. కర్మజేయుటయందు కొడుకునకంటె మేనల్లునికెక్కువప్రాముఖ్యతనిత్తురు. కర్మచేయించువానిని వెజ్జువాడందురు. సాధారణముగా చచ్చినవారిని ఖననముచేయువిధానమునే యవలంబింతురు. విశూచి, మశూచి మొదలగు జాడ్యములచే జచ్చినవారిని దహనమస లేచేతురు. చచ్చినవానిపనిముట్లకును, ఆభరణములకును డోలువాడు వారసుడు. చచ్చినవానిసమాధిపై కొలదిరోజులవరకునీళ్లనుబోయుచుందురు. వానిబంధువులుగాని స్నేహితులుగాని యాత్రవ నడచుటదటస్థించినప్పుడు తమకు వానియందుగల అనురాగసూచకముగా కొంచెముపాగా కాసమాధియందిడెదరు. వలయునంతద్రవ్యములభించినప్పుడే, దినమును జేయుదురు. కాని, వెంటనే జేయవలెనను నియమము లేదు.

—* 25 ప శు ధ న ము. *—

వీరు పశుసంరక్షణయందంతగా శ్రద్ధవహింపరు. పశువులకు పాకలుండవు. పొలమునందే మందగట్టుదురు. ఆరుబయట హోరునవర్షముకురియుచున్నను, మొలబంటిలోతుబురదలో

నిలుచుండవలసినదే గాని, పరిశుభ్రమగు వెచ్చని ప్రదేశమునకు మార్చనిచ్చగింపరు. మందలుకట్టుట, పాలమును సత్తువజేయుట కొఱకే. వీటినన్నిటిని పాలమునందొకభాగమున గుంపుజేసి వాటిచుట్టును గళ్లతడికెలను నిలువబెట్టుదురు. వీటినే వొడ్డితడికెలని యెదరు. వీటికొకవైపున నింకొకచిన్నతడికనమర్చుదురు. దీనినే గుమ్మముతడికెయందురు. పశువులను బయటికి వెడలగొట్టవలసి వచ్చినప్పుడీతడికెను తెరచెదరు. ప్రతిమందకొక ఆలబోతుండును. మందలోనిపశువులకు వేర్వేరుపేర్లుండును. ఏపేరుతో దేనిని బిలచిన, ఆమందలోనుండా పేరుగలదె బయటికివచ్చును గాని; తదితరములు కదలక నట్లేయుండును. పాడియావుల లేగలను మాత్ర మింటివద్దనుంచుదురు. పాలుపితుకవలసివచ్చినప్పుడా లేగతల్లినిబిలచిన, నదిబయటకువచ్చి లేగకుపాలిచ్చి, తిరుగ లోనికేగును. గేదెలకుగూడ నిట్టివ్యవహారికనామములేయుండును. రాత్రిభాగమందు పాలనుబితుకరు. ఆదివారమునాటి పాలను గాచరు. పచ్చికతప్ప యితరాహారములెవ్వియు నిడరు. అడవిలోనికసవు, యేటిలోని నీరేవీటికాహారములు. ప్రతిసాలునా వీటికోడెలనమ్ముకొనెదరు. ప్రతిమందకొకమనిషి కాపుండును. పంగలున్న కఱ్ఱలను నాల్గింటిని, నాల్గువైపులపాతి వాటిపై నొక నులకమంచమునుంచి, ఆమంచముపైనుండువానికి, శీతవాతాతపములనుండి, బాధకలుగకుండులాగున, యింటివంటి కప్పు నమర్చెదరు. ఇదియొకచోటునుండి మరియొకచోటునకుమార్చవీలుండును. దీనిపైకప్పును తట్టయందురు. పాతినపంగలులకఱ్ఱలను



బడ్డీకఱ్ఱలందురు. వీరెంత ఆయాశపడి వాటినికాయుచుందురో, అంతఅనాయాసముగా వాటినిదొంగలు దోలుకొనిపోవుదురు. దొంగిలింపబడినపశువు లేదారిని బోయినవో వీరనాయాశముగా గనిపెట్టుదురు. దీనినే జాడదీయుటయనెదరు. పశువులుబయలుదేరిన చోటునందుండు యడుగులజాడలనుబట్టి గుర్తింతురు. ఒకడొక పుల్లనాడెక్కల యానవాళ్లందుంచి, వంగి వరుసతప్పకుండ తదితరపశువులడెక్కలయానవాళ్లెన్నియున్నను వాటినన్నిటిని నరకుజేయక, తానుమొదటవంగినచోటునుండి, తప్పిపోయినపశువెందుండునో యచ్చటనే లేచును. తప్పిపోయినపశువులజాడదీయుటయందు వీరికి అసమానప్రజ్ఞావిశేషములున్నవని జెప్పనొప్పును.

వీరలు మేకలమందలకుమాత్ర మొకవిధమగు సదుపాయమును జేతురు. ఊరికిచేరియుండు విశాలమగు జదునప్రదేశమునందు గర్భవిరళముగలనొకచుట్టుగుడిసెను నిర్మింతురు. గుడిశలోభాగమునందు పైకప్పునకును క్రిందినేలకును మధ్యముగానొకయటకను తడికెలతో నిర్మింతురు. క్రిందికివాల్చబడినప్పుడు మేకలెక్కుటకు వీలుగానుండునట్లును, పైకెత్తిన నటకను మూసివేయుట కనుకూలముగా నుండునట్లును నొకప్రక్కను మరియొకతడక నమర్చెదురు. సందెవేళమందలింటికిరాగానే మేకలన్నియు వాల్చబడినతడికమీదుగా యటకవలెనుండు తడకపైకెక్కును. అటుతర్వాత వాల్చబడియున్నతడకను పయికెత్తి మరల క్రిందికిజారిపోకుండులాగున కట్లతో బిగియింతురు.

మేకలన్నియు బయటికగుపించక లోనుండిపోవును. ఘాతుకమృగమేదైన రాత్రులయందు వీటిని దినవచ్చినను లోజొరుటకు వీలుండనందున వెడలిపోవును. ఈజాతులు గాలివానల దెబ్బల కాగలేక విస్తారము చచ్చును. ఇట్టి యనుకూలప్రదేశములందుండువాటికి వీటివలన ప్రమాదమంతగా నుండదు. వీటివలన విసర్జింపఁబడు మలమూత్రములు యటకతడక రంధ్రములగుండా పాకఅడుగుభాగమునకు జారిపోవును. తెల్లవారగనే తిరిగి తడకను వాల్చుదురు. మేకలన్నియు బయటికి వెడలిపోవును. వీరికిపశువులేధనము. పశువులె యాహారము. పశుసముదాయమునుబట్టియె పరపతియుండును. కాని, వీటి ప్రాముఖ్యతను గమనించి వాటిని వృద్ధినొందించుటయం దత్యంతశ్రద్ధ వహింపక నిర్లక్ష్యము వహింతురు. వీరియల్పసంతోషమే యిట్టినిర్లక్ష్యభావమునకు ముఖ్యకారణము.

—*28బండ్లు.*—

వీరుపయోగించుబండ్లు జిన్నవిగానుండును. వీటిని కచ్చడములందురు. బండినడుచుటకేదైన నాటంకము కలిగిన మొకల్ల, దాని వివిధభాగములనూడదీసి, దలపైనిడుకొని, అడ్డుదాటించ వీలుండునంత చిన్నవిగా నుండును. వెనుక వెడల్పుగాను ముందు సన్నముగను నుండును. ఆఘాతములగు వాగులలోను, యెత్తుగుకొండలోయలనుండియు యెక్కి దిగవలసియుండుటచే, పైకెక్కునప్పుడులోనుండువారు వెనుకకు జారకుండులాగున,



వెనుకభాగమందొక చిక్కమల్లబడియుండును. క్రిందికి దిగునప్పుడు ముందునకుజారకుండుట కొకత్రాడు గట్టబడియుండును. దీనికిపోలుగర్రి యుండదు. బండిచక్రము రెండు పొడుగాటి కఱ్ఱలకు యినుపశీలలతో బిగించబడియుండును. యీ కఱ్ఱలు వెనుకవైపున వేర్వేరుగానుండి ముందువైపున కలుసుకొనిపోవును. వీటిని నొగలందురు. నొగలు కలసినచోట కాడికర్రిమధ్యభాగమును మోపి, అది యిటు నటు జంకకుండుటకు తోలుతాడుతో బిగియింతురు. రెండు కర్రలపైన అనగ నొగలుపైన చక్రమును మోపుజేయుటచేఁ ఒక చక్రిమేదైన యెత్తెక్కి నొకవైపునకు నొరగినను బండిపడిపోదు. చక్రములు చిన్నవిగాను, పొట్టివైన బలిష్టములగు పూటీలుకలవిగాను నుండును. కుంచమునకును పూటీలకును మధ్యమందుండు ఆకులు పల్చగాగాక, దళసరిగాను దిట్టముగాను నుండును. వీటిపైన, చుట్టము తోలుతో కుట్టబడిన, వెదురుచాపలతో గూడును గట్టుదురు. యీబండ్లడవిలో నడుచునప్పుడు ముండ్లకంపలకు తగిలి చాప చిరిగిపోకుండుటకుగాను, గూడును సాధ్యమైనంతవరకు దింపి కట్టుదురు. బండి పరుగెత్తుచున్నప్పుడుగాలిగాని, ధూళిగాని లోనికి జొరవీలుండదు. ఇట్టి చిన్నబండ్లకు రెండెడ్లను కట్టుదురు. ఇవి వేగముగా పరుగెత్తగలవియు చురుకైనవియునైయుండును. గంటకు 6 మైళ్లు లగాయతు 8 మైళ్లవరకు పరుగెత్తును. వీటికి గుర్రములవలె, దాణాయిచ్చి మాలీసుజే

తురు. నడకలనుగూడ నేర్పెదరు. సంజ్ఞామాత్రముననే ఆజ్ఞా
నువర్తులగుటకు ముగుదాళ్లను వేయుదురు. వీటిని మువ్వలతో
ను, గంటలతోను, చిరుముట్టె త్రాళ్లతోను నలంకరింతురు. ప్రతి
బండికి నీళ్లుంచుకొనుట కొకతోలు సంచియుండును. దీనిని దాబ
లకాయయందురు. నిర్జలప్రదేశమునందు ప్రయాణము జేయువా
రికిట్టిదత్యంతావశ్యకము. క్రూరమృగముల నదలించుట కొక కొ
మ్ముబూరాయుండును. ఎద్దులమెడయందుండు మువ్వల మ్రోత,
రాత్రిభాగమందె దరవచ్చు బండ్లను తప్పుకొనుట కెచ్చరించుట
కుపయోగించును. ఇవి యెంతదూరము బరుగెత్తినను వగర్పవు.
నురుగును గ్రక్కవు. బండ్లకుయినుప యిరుసేగాక బిల్లు కర్ర
యిరుసులనుగూడ నుపయోగింతురు. ప్రతిబండి యందొకటరెం
డిరుసులదనముగ నుంచుకొందురు. ఒకడు పరుండుటకును ని
ద్దరుకూర్చుండుటకును, తగినంత విశాలము గలవిగా మాత్రముం
డును. కోయలు, వీటిమీద, తమఅయివయిజు నెక్కించిసంతలకు
దెచ్చియమ్ముకొని, తమకుగావలసినవాటి నాదద్రవ్యముతోగాని,
లేక తమరు తెచ్చినదానికిప్రతిశుద్ధాగా గానిదీసుకొని, తిరిగి యీ
బండ్లమీదనే యెగుమతి జేసికొని తమ తమ గూడెములకు
గొనిపోవుదురు.

—*29 తోటలు*—

కోయలు, త్యాగ భోగములన నేమో యెఱుంగరు. త్యా
గభోగములున్ననేగాని, తోటలు, ఉద్యానవనములు నత్పత్తి



యగుట కాస్పదముండదు. ఫలాదులయంద నుభవేచ్ఛయుండె
గాని, వాటిని ప్రయత్నపూర్వకముగా పెంచుటయందభిలాష
తక్కువ. తోటితోట లక్కడక్కడనున్నవి గాని, విస్తారము
లేవు. ఇప్పుడిప్పుడు వాటియుపయోగమును గుర్తెరిగి ప్రయత్న
పూర్వకముగా బెంచజూచుచున్నారు. తునికిపండ్లు, వెలగపండ్లు,
రేగుపండ్లు అడవులయందు విస్తారముదొరకును. అడవిమామిడి
కాయలు కూడ నక్కడక్కడదొరకును. అరటిపండ్లు, కొబ్బరి
కాయలు, మామిడిపండ్లు పడవలవాండ్రమ్మకమునకు దెత్తురు.
వీరు కొండలనుగట్లు యందురు. గట్లుందునివసించువారు రెడ్లు.
వీరుపనస, అరటి, కమలాఫలపుతోటలను, తాముండుగట్ల
యందలి త్రోగులందు పెంచెదరు. పనసకాయలుండును గాని
అవి యధికారులకేగాని యన్యులక లభ్యములు. పిందెబుట్ట
గనే దానికొక చీటినిగట్టెదరు. అట్టి కాయలధికారులవని,
యన్య లెవ్వరునుముట్టరు. అక్కడక్కడ మామిడితోటలున్నవి.
గాని, వాటినపేక్షించువారు చాలమంది యగుటచే చెట్టుకల
వాని కొక్కటియైనను మిగులుటదుస్తరము.

—*32 భాష*—

వీరు మాట్లాడునది కోయభాష. ఈ భాషయందక్షర
ములుగాని, అంకెలుగాని లేవు. వీరిభాషోచ్చారణ విస్రాశావ్య
ముగా నుండును. ఆంగ్లేయభాషోచ్చారణను బోలియుండును.
స్త్రీలు పురుషులంత కఠినముగాను స్పష్టముగాను మాట్లాడరు.

స్పష్టముగానుండకపోయినను మృదువుగాను మధురముగాను నుండును. గొట్టుకోయలు మాట్లాడునదీభాషయెగాని, అక్కడక్కడ స్వల్పభేదము లుండునందురు. ఉచ్చారణ యందలి యాసచేగాని భాషయందలి భేదముచేగాదందురు. రెడ్లుమాట్లాడునది దెనుగుబాషయెగాని యాశగానుండుటచే, త్వరగా నర్థముగాక వేరుభాషవలె గన్పట్టుచుండును.

—*కులవృత్తులు*—

వీరిలో పురుషులుచేయు అన్నివిధములగు పనులకు స్త్రీలు సహకారులగుచుందురు. చేతిపనుల కవసరమగు సాధనసంపత్తి సమృద్ధిగాగలదుగాని, పూనుకొనువారు లేనందునను ద్రవ్యార్జనా కుతూహలము లేనందునను రాణింపకున్నది. మట్టితో కలసియున్న యినుమును దేశీయకొలుములయందుంచి, గఱగించి పరిశుభ్రమైనయినుమునుదీసి, దానితో తమ కవసరమగు పనిముట్లను దయారుజేసికొందురు. వీరు వడ్రముగూడ బాగుగా జేయుదురు. గడ్డితో తుంగచాపలనల్లుదురు గాని తగుప్రోత్సాహము లేనందున క్రమక్రమముగా నీవృత్తిగూడ క్షీణగతి నందుచున్నది.

—♦ దొంగతనములు. ♦—

వీరికి పశువులదొంగతనము బాహాటమైనవృత్తి. అన్యులచేలలోని సస్యము నెత్తుకొనిపోవుదురుగాని, పట్టుబడినసాక్ష్యమక్కర లేకుండగనె వప్పుకొని, దొంగిలించినదానికి బదిరెట్లి



మ్మన్ననుమాట్లాడకయే నిచ్చుకొందురు. వీరాస్తిదొంగతనమున యిదివర కెఱుగరుగాని సహవాసదోషమున యిప్పుడిప్పుడలవడుచున్నారు.

—* విద్య. *—

కోయలకొఱకు కొన్నిబడులు నెలకొల్పబడినవి, గాని విద్య నభ్యసించువారు బహుతక్కువ. వీరిలో చదువుకొనుటకు నిష్టపడువారికి, గవర్నమెంటువారు, యెదురు వేతనముల నిత్తురు. వ్యవసాయపు తరుణమందు వీరి బాలురలో విద్యనభ్యసించువారెవరైన నున్నయెడల బడికిరారు. కోయవిద్యార్థులక్కడక్కడనున్నారుగాని, కోయయుపాధ్యాయులు లేరు. వీరు విద్యయనుపదమునకు కేవల మక్షరజ్ఞానమని నూహించెడివారుగారు. వీరికి విద్య గరపుచున్నవారెట్లు సంతోసింతురో, వీరు తమ విద్యను వారికిగూడ నేర్పుచున్నందుకు నట్లే సంతోషించుచుందురు. వీరు విజ్ఞానమునే విద్యయందురు. వీరు నిరక్షరకుక్షులగు విద్యావంతులు. వీరిభాషయందక్షరములుగాని, యంకెలుగానిలేకుండుటచే వీరి విద్యా ప్రభావము, ప్రచారమునందలేకున్నది. వీరి విద్యాకౌశలత్వము వీరిని క్షుత్పిపాసలనుండి విముక్తత నొందించగలదు. వీరక్షరజ్ఞానమును, పరస్పరవైషమ్యములకు గారణమందురు. అక్షరజ్ఞానము తమజీవనాధారమునకు దోడ్పడదందురు. కావున, నిట్టివిద్య నలవడజేసుకొనుటలో గాలమును వ్యర్థపుచ్చకుందురు. వీరియాహారపదార్థములు హేయ్యములుగా నగుపించునుగాని, యితరకంటె యసహ్య

దార్థముల నారగించు నాగరికజాతు లున్నారు. వీరినృత్యగాన
ములు నాగరికజాతులవలంబించువాటివలెనే యుండును గాని,
నవనాగరికతననుసరించి మార్పు జెందబడియుండక పోవుటచే కొం
చెముమోటుగా నుండును. వీరివివాహవిధానములు మనపూ
ర్వుల వివాహవిధానముల ననుకరించియేయున్నవి. వీరిమృగ
యావిలాసమే క్షాత్రవంతుల కభిమానవిద్య. మద్యపానాదుల
యందపరిమత్తత యిక్కాలపువారివలన నిరసింపబడునదిగాదు.
వీరివివేకము లేనిదానిలభ్యమునకై యడియాశలందించక నున్న
దానితో తృప్తినొందించుచున్నది. వీరనాగరికులయ్యును నభిమా
నదేవత కాశ్రితులు గారు. వీరు స్వతంత్రాభిలాషులు. వీరాత్మ
గౌరవముగలవారై తమజీవయాత్రలను గడుపుకొనుటకు అ
న్యులపై నాధారపడరు. ఉదాశీనత వీరి నసలే యంటదు. ఇట్టి
నిజలక్షణములుగల వీరు విద్యాసంపన్నులో విద్యావిహీనులో
చదువరులే నిర్ణయింతురుగాక. ఇప్పటివిద్వాంసులు వీరివలన నే
ర్చుకొనవలసినవిషయము లనేకములున్నవి. వీరిచిత్తవృత్తులు ని
శ్చలముగా సంచరించుచుండు మృగరాజు చిత్తవృత్తులను బోలి
యుండును. గ్రుడ్డివానికి లోక మంధకారబంధురమువలె గన్పట్టు
నట్లు అల్పజ్ఞులగు నాగరికాగ్రేశరు లనుకొనువారలకు వీరు
కించిజ్ఞులగు పిచ్చివావలెనగుపింతురు. దీర్ఘదర్శులగు ప్రభుత్వము
వారువీరిని అనాగరికులనుటలో మనలను సంతోషపెట్టుటకు మ
న యభిప్రాయములలో నేకీభవించుచున్నను వీరియందు నిబిడీ



కృతమైయుండు నాత్మగౌరవమును, వీరిమనోబలమును దృఢచి
త్తమును కన్పట్టి యుచితరీతిని ఆదరించుచున్నారు. వీరిదేశ
మునందలి యరణ్యములంతరించి కందమూలాదులు నిర్మూల
మై పక్వఫలాన్నభోజనములం దాశక్తిబొడమి, నీటి, మెట్ట, అ
యో వాయుమార్గములందుండు ప్రయాణసౌకర్యములకలవడి,
యాత్మగౌరవముజచ్చి యభిమానదేవతయావహించినప్పుడే వీరికి
అజ్ఞానములవదునుగాని, యంతదనుక వీరావైపునకు మరలరు.

## మద్యము

వీరు కల్లు గీసుకొనవచ్చును. సారా కాచుకొనవచ్చును.
చెల్లకుగాని బట్టీలకుగాని పన్ను లేదు. తాటికల్లు గీయుపనిము
ట్లు యితరప్రాంతములోని వాటివలెనె యుండునుగాని చెట్టె
క్కుటకు నిచ్చెనవుండదు. కణుపులతోనుండు పొడుగాటి వెదు
రుబొంగును చెట్టెక్కుటకుపయోగింతురు. ఇది భూమినుండి చె
ట్టుయొక్క మట్టలవరకునుండును. కట్టకిరుప్రక్కలనుండు కణు
పులమీదపాదములాని, పైకెక్కుదురు. కల్లుగాయు గెలలనుగీసి
వాటికి కుండలొట్టియలను గట్టక, వెదురుగొట్టముల నమర్తురు.
వీటినితరుచు పరిశుభ్రము జేయకపోవుటచే పాకుడుగట్టిదుర్వా
శనగొట్టుచుండును. అలవాటులేని వారిందూరు కల్లారగించిన,
వాంతులగును. సారా కాచుబట్టీలుయితరచోట్ల వాటివలెనేయుం
డును. వీరుయిప్పసారానేగాని తాటిసారానుతరుచుకాయరు. సా
రా కాయుటకుముందు యిప్పపువ్వునుపులియబెట్టుదురు. ఒకవు

ర్యాయముదింపి సారాను, మరియొకమారు కాయుదురు. ఇట్లు కాచినదానిని కషాయిసారాయందురు. ఒక కోడిపెట్టను దెచ్చి, దాని పొట్టచీల్చి, అందలి ప్రేగుల నూడబెరికి, వాటికి ప్రత్యామ్నాగా దానిపొట్టయందు సుగంధయుతములగు మసాలాసామానులను నూరినముద్దను కుక్కి, కుట్టివేశి, దాని నాబట్టికుండపైభాగమునుంచుదురు బట్టికుండలోని యావిరిదీనికితగులుటచే, దానియందలిసారము సారాదిగుకుండలోనికిదిగును. అట్టిదానిని తమయిష్టబంధువులకు నేమానుగానంపించుచుందురు.

## —* 24 వర్తకము *—

కోయలతో వ్యాపారసంబంధముగలవారు ముఖ్యముగా కోమట్లు. వీరుగాక రెడ్డీలను మరియొకతెగవారు పడవలపైన సరకులనుదెచ్చి యిక్కడదిగుమతిచేసి వీరివద్దసరకులను యెగుమతిజేసుకొందురు. పూసలవర్తకులను మరియొకతెగవారు గంపలతో సరుకులనెత్తికొనిపోయి గూడెములందు గింజలకు నమ్ముకొందురు. రెడ్డీలలోను పూసలవర్తకులలోను చాలవరకు బేరమాడువారివలననే జరుపబడుచుండును. కోయలతో వ్యాపారముచేయజూచువారికి పాపభీతియుండకూడదు. వీరికి తాముపండించుపంటసరకులను సమీపపట్టణమునకుగొనిపోగల నిరపాయమగు నీటిమార్గములుగాని, రాజబాటలుగాని లేవు. క్రమమైనధరలు తెలుసుకొనుటకు యవసరమగువిజ్ఞానముగాని, విజ్ఞానముదయింపజేయగల సాధనసంపత్తిగానిలేదు.



క్రమమైనధరవచ్చునరకు నిలువజేసుకొనుటకును రక్షితమైనయిండ్లకొట్లుగాని నంతదనుక నమ్మకుండ నాపగలమోతుబరీగాని లేదు. వీరివ్యాపారవిధానము పూర్వకాలపు బార్టరింగు Bartering ను బోలియుండును. (Bartering) యన తమకున్నవాటినిచ్చి కావలసినవాటినిపుచ్చుకొనుటయే. వీరితో వ్యాపారముచేయువారీక్రిందివరింపబోవు వివిధవిధానముల నవలంబింతురు. ఇవియెవ్వియన 1 నాగులవ్యాపారము. 2 వడ్డిపెచ్చులు 3 వడ్డివ్యాపారము 4 నగదుఅమ్మకము.

నాగులవ్యాపారమునందు తిరిగి మూడుతరహాలుండును. 1 సరినాగు 2 తోకనాగు 3 పిన్ననాగు. సరినాగన, నాలుగు శేర్ల గింజలనప్పిచ్చి ఎనిమిది శేర్లను బుచ్చుకొనుట. అనగా రెట్టికి రెట్టి నాలుగు శేర్ల నప్పిచ్చి ఆరుశేర్లను వసూలుజేయువిధానమే తోకనాగు. అనగా ఒకటికి, ఒకటిన్నర. నాలుగు శేర్ల నప్పిచ్చి, తిరిగి యైదు శేర్లనుమాత్రమే పుచ్చుకొనుట కేర్పాటుచేసుకొన్నప్పుడట్టిదానిని పిన్ననాగందురు. అనగా ఒకటికిఒకటింబాతిక. వీరిట్లునాగులకు అగష్టునెల లగాయతు అప్పిచ్చి, మార్చినెలనుంచి వసూలారంభింతురు. అప్పుబుచ్చుకొన్నవాడు నిర్ణయించుకొన్న వాయిదానాటికి వసూలు యివ్వనియెడల, మొదట యేర్పర్చుకొనిన షరతుప్రకారం, వాయిదానాటికి యివ్వతేలే గింజల మొత్తమును తేల్చుకుని వాటికి తిరుగ సరినాగుతో యిచ్చుటకు యేర్పరచిమరల పద్దువ్రాయించుకొందురు. అపివ్వబోవు కాలమందు అప్పిచ్చు గింజలకుండు బజారుధర. వసూలి

చ్చుటకు యేర్పర్చుకొన్న వాయిదానాటికి తక్కువైయుండునని తోచినప్పుడు, గింజల నాగున కప్పియ్యరు. ఆసంవత్సరపు కాలమానస్థితులనుబట్టియు అంటిన పైరునుబట్టియు పండబోవు పంటను అంచనా వేయుదురు. వీరికిది నిత్యవృత్తియగుటచే, సిరీవిద్య యందత్యంత నిపుణత్వమును గలిగియుందురు. ఇందుకుదృష్టాంతరమేమన, అగష్టునెలలో పాతజొన్నలు ధరపుట్టి 1కి రు 80 లుండుననుకొనుడు. ఆసంవత్సరపు కాలమానస్థితులను కూలముగానుండి, పైరు బాగా అంటినయెడల, క్రొత్తజొన్నల ధరపుట్టి 1 కి రు 40/-లకు తగ్గు సూచనలగుపించుననుకొనుడు. యిట్టి పరిస్థితులలో పుట్టెడుకు మరిపుట్టెడు యిచ్చుపద్ధతిని అప్పిచ్చినను, అప్పిచ్చువానికి లాభముండదు. వసూలిచ్చువాడు తాను బదులుపుచ్చుకొన్న పుట్టెడుకు మరిపుట్టెడు కలిపి రెండుపుట్లు బదులుతీర్చెననుకొనుడు. క్రొత్తగింజల రోజులయందుండు ధరప్రకారము రెండుపుట్లకు వచ్చు అమ్మకమెనుబదిరూపాయిలే. రు 80 ల కిమ్మత్తుగల జొన్నలప్పిచ్చి, 80 లు అమ్మకము వచ్చు జొన్నలను వసూలు చేసుకొనుటచే లాభమేముండును? కాబట్టి, వీరిట్టి సమయములయందు నాగులకు అప్పివ్వక, బజారుధరప్రకారమును అడుగువాని అవసరమును బట్టియు, తాము అప్పివ్వబోవు గింజలకు ఖరీదుగట్టి, సొమ్ముకు సొమ్మున్న వడ్డీక్రింద గింజలను యిచ్చు షరతులతో నోటు వ్రాయించుకొందురు. ఈ విధానమువలన వీరు తమద్రవ్యమును గింజలను గూడ వృద్ధిచేసుకొనగలుగుదురు. ఒకకో



యవాడు, తానొక కోమటివద్ద వీశెడు మిరపకాయలను గింజల నాగున కప్పుచ్చుకొని, యరువది కాళ్ల పశువుల నాభాకీ కింద కట్టినను, ఋణవిముక్తత నొందలేదని లోకోక్తిగా జెప్పుకొందురు.

2 రొఖమును బదులిచ్చి, దానివడ్డీక్రింద అయివజు నిచ్చుపద్ధతినె వడ్డీపెచ్చులందురు. రొఖపుబదుళ్లు కావలసినవారవలంబించువిధాన మిదియే.

3 వడ్డీవ్యాపారమింకను విచిత్రముగానుండును. బదులు యివ్వబోవు మొత్తమునకు ప్రానోటు వ్రాయించుకొనియు, యివ్వవలసిన మొత్తమంతయు నివ్వక, కొంతమొత్తమును అప్పిచ్చువాడు తనవద్ద నిలవనుంచును. పుచ్చుకొన్నవాడామొత్తమును కర్చుపెట్టుకొని, ఋణదాతవద్దనిలవనున్న మొత్తము నివ్వవేడును. ఇట్లొకటిరెండుపర్యాయములు ద్రిమ్మరుసరికి, మరికొంతద్రవ్యమవసరమగుట దటస్థించును. అదివరకు నిలువనున్న మొత్తముతోపాటునిప్పుడవసరముకలిగిన మొత్తముగూడను నివ్వమనికోరుట కాతనిమనస్సు పురికొల్పుచుండును. ఋణదాత యదికనిపెట్టి మరేమైనను యదనముగా కావలసిన నిప్పుడే పుచ్చుకోవలసినదేగాని, గడియగడియకు నన్ను తొందరపెట్టినయడల నావద్దనుండక తొట్రుపాటుపడవలసి వస్తావుంటుందనే మామూలుముక్తాయింపులు ముక్తాయించుచుండును. ఈమొక్తారికనిపెట్టి, మరికొంత మొత్తమును కలిపియివ్వనునును. అప్పిచ్చువారున్న పుచ్చుకోనిచ్చగించనివా రరుదుగానుందురు.

ఉన్నవాడు తనవద్ద నిలువయుంచుకొనుటకు యిష్టపడడు. లేని
వాడు అప్పడుగుటకు కారణములకొఱకు తడుముకొననక్కర
లేకుండగనే వాటంతటవియే సదా వాని సాన్నిధ్యమందు శి
శ్రూషయొనరించుచుండును. ఋణదాత వీనియాస్తితమునెఱిగి,
తనవద్ద నిల్వవున్న మొత్తముకూడ కలిపి నప్పటివర కా మొత్త
మునకు వడ్డీకట్టి, యిప్పుడివ్వబోవు మొత్తము నందులో కలిపి
తిరిగి నోటువ్రాయించుకొనియు, యథాప్రకారముగానే మొత్త
మంతయునివ్వక, తనవద్దకొంతనిల్వయుంచును. ఈవిధముగా
అప్పుపుచ్చుకొనువాడు తనకు కావలసివచ్చినప్పుడల్లా వడ్డీ న
సలులోచేర్చి వ్రాశియిచ్చుచుండును. ఋణదాత తిరిగివ్రాయిం
చుకొను ప్రతిపర్యాయము తనవద్ద కొంతనిలవయుంచుచుండు
ను. మొత్తమంతయు పూర్తిగాయిమ్మని నిర్మొగమాటముగా
నడిగిన, మరుచటిపర్యాయ మివ్వకపోవుటయేగాక, అదివరకివ్వ
వలసిన మొత్తమంతయు ఒకేపర్యాయ మిచ్చివేయుమనునేమో
యని పుచ్చుకొన్నవానికి భయము శీదాగాయిచ్చిన, తిరిగి తన
వద్దకు అప్పునకురాడేమో అని అప్పిచ్చువా డూహించుచుం
డును. ఈవిధానమువల్ల నగదుబదులిచ్చువారిసొమ్ము నొకేసం
వత్సరములో అసలునకంటె ననేకరెట్లు అభివృద్ధినొందుట తట
స్థించుచుండును.

వీరుపండించు పంట వీరిచ్చుకొనవలసిన వడ్డీలక్రింద సరి
పోవుచుండును. అప్పున్నవారికి వొదగివుండవలసివచ్చుటచే పం
టకళ్లములోని మైవైజులను వారడిగినధరలకే కొల్చివేయు



దురు. వీరి ఋణదాతలగు వర్తకులు, వీరివద్ద తక్కువధరలకు
కొల్చుకొనిన ఫలసాయమును తిరిగి వీరికే యెక్కువధరలకమ్ము
కొని, క్రయవిక్రయములలో విపులమగు యక్రమపులాభ మను
భవింతురు. వీరి స్థిరాస్థులకు విలువలేదు. వీరుపండించు పం
టనుబట్టియు వీరిదొడ్డియందుండు పశుసముదాయమునుబట్టి
యు వీరల మోతుబరి నిర్ణయింపబడుచుండును. వీరికిభూమియం
దమ్ముకొను హక్కులేకున్నను, నీ దేశపుకోమట్లకు వీరిమా
టయందెక్కువనమ్మకము.

అమాయకులగు వీరల నప్పులపాల్జేయుటలో యీ
ప్రాంతములందుండు కోమట్లకున్నంత నిపుణత్వము మరి యే
యితరప్రాంతములవారియందును గానరాదు. వీరియందవ్యాజా
నురాగముగలవారివలె నటించి, వీరిచంకలకు జోలెలుతగిలిం
చుటయందింతటి ప్రముఖులు మరెక్కడను లేరు. వీండ్లకు
తాముపండించు పంటను నిలువయుంచుకొనుటకు సురక్షిత
స్థానములుగాని, దాచుకున్నవానినిధరరాబట్టి యమ్ముకొనుటకు
సమీపమందు సంతలుగాని, అమ్మడగుప్రదేశములకు తమ
అయివైజుననాయాశముగా చేర్చుటకనువగు తగురాజమార్గము
లుగాని, లేకపోవుటచే తమకు కావలసినసరకులకు ప్రత్యా
మ్నాగాను తామివ్వవలసినబాకీలక్రిందను, తమకు పండినదాని
నిచ్చుకొనుటయు, యింకను నిల్వయుండినయెడల అయిన
కాడికి అమ్ముకొనుటయు, తిరిగి తమకవసరమువచ్చినప్పుడల్లా

తాము అమ్మినవానివద్దనుంచె అప్పుగా గొనుచు, దానికి అపరిమితమగువడ్డీతో యిచ్చుకొనుటయు తటస్థించుటచేవీరిస్థితినానాటికి దుర్భరమగుచున్నది. కోమట్లు కోయగూడెములందు జనవరినెల లగాయతు జమాబందీ ప్రారంభింతురు. కోయవానికి కోమటియన్న నెక్కువ భయము. కోయగ్రామములో కోమటికరిణీకమను సామెతయొకటికలదు. కోమటియందు కోయవానికివుండు భయమెట్టిదో యీపైసామెతయే వ్యక్తీకరింపగలదు. కోయవాడు తనకు యప్పుపెట్టినకోమటిని జూచినంతనే గుడిశె విడిచి, పొదలంటపాఱిపోవును. యీసంగతి ఆఋణదాత కనిపెట్టి వానిగుడిశెలోనికి జొరబడి వాడింటిఅటుకపై ఆకుతెప్పలలో దాచుకొన్నవిత్తనపుగింజలనుసైతము కొల్లగొనును. ఆయింటివాడించుక ధూర్తస్వభావముకలవాడైన, తిరిగి కావలసినప్పుడిచ్చెదమని మంచిమాటలతో బుజ్జగింతురు. మేధకుడైనద్దుజెప్పిన కొట్టబోవుదురు. ఈవిధముగా ప్రోగుజేసినగింజలను తమవెంటనుండు బండియందిడుచు, బండి పూటుకాగానే యింటికి తోలిపెట్టుచుందురు. కంటికినదరానినపశువులను వలదు వలదని వాడెంతయేడ్చుచున్నను, నిర్దయులై తమపితురార్జితమువలె తమయింటికి తోలుకొందురు. కోమట్లబాకీ తెగబెట్టుమని యెవరైనను బోధించినను, తమకు కావలసినప్పుడు తిరిగి యివ్వరనుభయముచే యెగబెట్టుటకు యిష్టపడరు. కోయవాడెంతవసూలిచ్చినను, కోమటిమాత్రము బాకీ తీదాగా చెల్లిపోనీయడు. అప్పు తీర్చవలెనను మానుషముకలవాడని



తోచినయెడల యివ్వవచ్చినప్పుడు పుచ్చుకొనడు. వానివద్దనేమియు నుండనితరుణములో వానిని తొందరజేయును. వాడు తన అసమర్థతవెల్లడించిన వీరు తమవక్రబుద్ధి నుపయోగింతురు. వసూలిచ్చినదిగాక నిలిచియుండుమొత్తము మనతికాలములో యెప్పటియట్లు వృద్ధియగుటకు సూత్రములుపన్నుటలో వీ రతినిపుణులు. వీరి బసుల్లకు హామీలక్కరలేదు. అప్పు పుచ్చుకొన్నవాడు తెగబెట్టుటకనేకసులభోపాయములున్నవి. వీరుండుప్రదేశమున కిరుప్రక్కలను నైజాం, బస్తరు, అనురెండు స్వతంత్రరాజ్యములున్నవి. వీ రెగబెట్టవలెనను దుర్వృత్తితో నీ రెండు రాజ్యములలో దేనియందడుగిడినను వానిబాకీ వసూలుజేయుట సులభసాధ్యముకాదు. సాధారణముగా నప్పుల వ్యాపారముజేయువారు తమ పెట్టుబడిసొమ్మును తొలిసంవత్సరమందె వసూలుచేసుకొందురు. వీరి కంతటినుండి వడ్డియే పెట్టుబడిగా నుండును. అనాచారము, అంగపటుత్వము, అసత్యవాదిత్వము, ఉచ్చనీచములు, పాపభీతియు లేకుండుటయు వీరితో వ్యాపారముజేసి లాభముపొందజూచువారికి వుండవలసిన ముఖ్యలక్షణములు వీరికి లాభమే పెట్టుబడికిందనుండును కావున, అన్యప్రాంతములవారు వీరితో వ్యాపారపుపోటీకాగజాలరు. అన్యులెవ్వరైనను యెక్కువధరలకు కొనవచ్చినను, తామంతకంటె యెక్కువధరబెట్టి కొల్చుకొందురు. యితరులుపోటీలేనప్పుడు ముందుగా వారి పంటగింజలను కొలుచుకొని

నటుతర్వాత ధర నిర్ణయింతురు. యిచ్చటిప్రజ లవివేకులగుట చే కొలపాత్రలుగాని తూనికరాళ్లుగాని, శిశలుగా నుండవు. వాటి నుపయోగించునప్పుడు అక్రమపద్ధతి నవలంబింతురు. తాము యివ్వబోవునప్పుడు శీలురాళ్లను, శిఖాశేర్లను, శీమ కాటలను ఉపయోగింతురు. తాము పుచ్చుకొనవలసివచ్చినప్పుడు కొలకుండలను, గుండ్రాళ్లను, చేతికాటాలను యుపయోగింతురు.

పట్నములనుండి వీరికి వలయుపదార్థములను పడవలపై నెగుమతి జేసుకొని వీరలకందజేయువిధాన మలవడజేశినవారు రెడ్డిలు, కాపులు. వీరు చాలవరకు తూర్పుదేశమునుండి వలస వచ్చినవారై యున్నారు. తమకుకావలసిన సరకులందిచ్చుటకును, తాముతెచ్చినసరకు లమ్ముటకును. పట్నవాళమందుండు వర్తకునొకనిని వీరు తమ ఖాయిదాదారుగా నియామకము జేసుకొందురు. ముందుగా తా మెగుమతీజేయబోవు సరకులను అద్దెపడవలపై కేవునకు వేయుదురు. వీరికులస్థులు చాల మంది అక్కడక్కడ విడిశియున్నారు. వీరిపడవలపైవచ్చు సరుకులను దిగుమతిజేసుకొని నాటుగూడెములందు చిల్లరవ్యాపారము జేయుచుందురు. పడవలవారు తమసరకు త్వరలో విడుదలకాదని తోచినప్పుడు నరువుయిచ్చుటకూడ కలదు. కొన్నిచోట్ల నరువిచ్చుచు, మరికొన్నిచోట్ల నగదునరకు అమ్మకొనుచు తమపడవలోనిసరకు అయిపోవువఱకు వీరెగువకు ప్రయా-



ణము జేయుదురు. వీరు తమసరకంతయు అయిపోయినతర్వాత గృహోన్ముఖులైతమబాకీలనువసూలునకుప్రారంభింతురు. చాల మంది దగాకోరులు అప్పిచ్చినవాడు వచ్చుచున్నాడని విన్నంతనే తాను తనబాకీలను వసూలుచేయునెపముతో కోయగూడెములకు ప్రయాణమగును. వీడు వచ్చునరకు పడవవాడు వేచి యున్నయడల పడవఅద్దెనిమిత్తమును, కళాసుల భత్యమునిమిత్తమును కాబోవుకర్చు తనకురావలసిన బాకీని మించునట్లుండును. అందువల్ల వాడు విసిగి, నిరాశజేసుకొని, తిరిగివచ్చినప్పుడు వసూలుచేసుకొనవచ్చుననేయాశతో వెడలిపోవును. ఋణదాత దుర్వ్యసనాశక్తుడని దోచిన, యెగబెట్టనుద్దేశించినవాడు రెండు కోడిపెట్టలతో రెండుకాయలసారాను నైవేద్యమిడిన తప్పించుకొనుట కనువేర్పడును. కైపెక్కి నోడలు నోలియక మతిచెడి, యింటికి బయల్వెడలును. కైపుదీరినతర్వాత తనయిబ్బంది ననుసరించి తనతప్పిదమును కనిపెట్టగలుగునుగాని ప్రయోజనమిసుమంతయునుండదు. యిట్టిబాకీ లభివృద్ధినొందిన కొలదియు వీరివ్యాపారము దుర్భరమగుచుండును. ప్రథమావస్థయందు వీరివ్యాపారము కోఅమీశములు, బొత్తాంకాళులు, కిర్రుజోళ్లపైన పఱుగెత్తుచుండును. మధ్యమావస్థయందు బాకీలజాపితా, రూళ్లపెన్సలు, మధ్యమధ్యమకాములతో మందగతిని నడచుచుందురు. అంత్యావస్థయందు పడవవేలం, కొంపతణఖా, మనిషి పరారియగుటతో పరిసమాప్తినొందును. వీ

రాదాయమును మించినవ్యయము జేతురు. తమలాభనష్టములను లెఖచూచుకొనరు. రకముతిరిగిన చాలునని సంతోషింతురు. వీరి ఖాయిదాదారులు కూడ వీరికి సన్యాసమిచ్చుటలో సహకారులగుచుందురు. వీరు దిగుమతిజేయుసరుకులను వీరి సాన్నిధ్యమందున్నారు. పరోక్షమందమ్మి యక్రమపులాభము నొందునుద్దేశముతో వీరి పడవ రేవుకురావేగమే నందుండుసరకులను దిగుమతిజేసుకొని, వీరికి యెగుమతికవసరమగు సరకులను ఖరీదుచేయించి పడవకు పంపించి, పడవను వెంటనే పాయదోయించెదరు. తనపడవకు కావలసినసరకులు అనతికాలములో యెగుమతికాబడినవనే సంతోషముతో రెడ్డికషాహుకారు తిరిగి మన్యమునకు ప్రయాణమగును. వీరిని సాగనంపితిమిగదా? ఇక నిర్భయముగా మోసపుచ్చవచ్చునని ఖాయిదాదారు యానందించుచుండును. ఖాయిదాదార్లు తమకాతాదారునిసరకుల క్రయవిక్రయములలో న్యాయసమ్మతమైన లాభముతో తృప్తినొందక యనేకరెట్లు నక్రమపులాభమును పొందుదురు. మన్యపువర్తకముచేయు పడవలవర్తకులకు తామెగుమతిజేసిన సరుకుల నరువులిచ్చుటచేతను, తమఖర్చులకు వీటి యమ్మకము నుండియె వ్యయపరుచుచుండుటవల్లను, తమ చేతియందుండుసొమ్ము క్షీణించుచుండును. దిగుమతిసరకుల యమ్మకము ఖాయిదాదారుని కృత్రిమమువల్ల క్రమేణ సమసిపోవుచుండును. యీవిధముగా కొంతకాలమగుసరికి అసలునకే మోసమువచ్చును. యిట్టి ఖాయిదాదార్లున్ను, [రిజాలా



వృత్తిగలవారలచేతులలోనుంచినపడవలవ్యాపార మెంతదైన్యావస్థయందుండునో తెలుసుకొనుట సులభసాధ్యము.

వీరుగాక గొట్టుకోయలను మరియొకతెగవారు యింకొకవిధమగు వ్యాపారము జేయుదురు. వీరు బస్తరురాజ్యమందును, మల్కనగిరితాలూకాయందును నుండు మహారణ్యములలో నుందురు. వీరు దార్ఢ్యవంతులు. ఆజానబాహులు. దీర్ఘకాయులు. నేర్పరులగు కృషికులు. సదాచారసంపన్నులు. స్వయంపాకులు. వారమురోజులవరకు సరిపోవుభత్యమును తమ మొలనుచుట్టియుండు చిక్కమునందిమిడ్చెదరు. వీరికి విల్లె కావడిబద్ద. దీని కిరుకొనలలను వంటసామానును, బిషాణాసామానును సంధించి భుజముపై నిడుకొని మోయుదురు. పరుండుటకు తుంగచాపను, వండుకొనుటకు మృణ్మయపాత్రలను నుపయోగింతురు. జుట్టును తరుచు దువ్వుకొందురు. సదా శిగముడియందొక దువ్వెన యుండును. అవసరమైనప్పుడు సులువుగా బయటికితీయ వీలుండునట్లును, పఱుగెత్తునప్పు డూడిపోకుండులాగునను, శిగముడియందంబుగ నమర్చుకొందురు. మొలత్రాడుక్రిందుగా తుంట్లపై వ్రేలాడునట్లొకకత్తిని సరికింతురు. కుడితొడమందొక కైజారుండును. చేతియందొక యందమగు గండ్రగొడ్డలియుండును. వీరు మైనము, ఆవాలు, తేనె, బియ్యము, కొమ్ములు, చింతపండు మొదలగువాటిని అమ్మకమునకుదెచ్చి, ఉప్పు, బట్టలు, కిరాణాసామానులు మొ

దలగువాటికి పరిత్యామ్నాగా యిచ్చెదరు. చేతివేళ్ల సంజ్ఞామూలముగనే వీరు బేరమును పరిష్కరించుకొందురు. బేరము పరిష్కారమైనవెంటనే పుల్లవిరిచెదరు. యిది వారిలో ఆడి తప్పకుండుట కొరకు గొప్పయాన. తాము పరుండుచోటు నందొక చాపనుపరచి దాని కిరుప్రక్కలను నెగళ్లను వేసుకొందురు. తమవద్దనుండు చాప ఒక్కడుపరుండుటకుమాత్రమే చాలి నంతదిగా నుండును.

## ఎగుమతులు దిగుమతులు.

కలప, మైనం, తేనె, కొమ్ములు, నెయ్యి, కరక్కాయలు, చింతపండు, ముషిణిగింజలు, రేలచెక్క, తంగేడుచెక్క, నార, చర్మములు, తుంగచాపలు, పొగాకు, అపరదినుసులు మొదలగున ఎగుమతిచేసి, ఉప్పు, బట్టలు, కిరాణాసామానులు, పండ్లు మొదలగునవి దిగుమతి చేసుకొందురు.

వీరు తమ గూడెముల కరణములను పట్వారీలందురు. గూడెములందు పట్వారీసహాయము లేనిదే, యెంత పెద్ద యుద్యోగిస్తుసైనను పలుకుబడియుండదు. సాంఘిక విషయములలో, వీరలు తమ సముతుదారు నాజ్ఞల కెట్లు కట్టుబడియుందురో, అట్లే రాజకీయ విషయములయందు, పట్వారియాజ్ఞలను శిరసావహింతురు. కొండపోళ్లను కొలుచుటకు పట్వారి బద్ధకించినను తాము స్వయముగా గొలిచి, కొలతల యానవాళ్లిత్తురు. తాము పోడుగొట్టిన ప్రదేశమును పట్వారి కన్నెట్టలేకపోయిన



ను, తాము స్వయముగా దగ్గరనుండి చూపుదురు. వీరి ప్రభుభక్తి, వీరి పట్వారీల యంతరంగమును బట్టి యుండును. పట్వారీలనదపులోనుంచిన వీరివంక జూడనవసరముండదనియె జెప్ప నొప్పును.

వీరు ఉపయోగించు నేయాయుధమునకును, లైసెన్సు యవసరము లేదు. వీరు తమ తగవులను పరిష్కరించుకొనుటకు న్యాయస్థానముల కెక్కరు. ఒకవేళ నెవరైనను న్యాయస్థానమున కెక్కి యనుకూలమగు నుత్తరువును బడయగలిగినను, అట్టివుత్తరువుతనకులపెద్దలచేతిరిగివిమర్శింపబడిననేగాని, యాచరణలోనికి దేబడదు. వీరికి స్థిరాస్తియం దమ్ముకొను హక్కులేదు. న్యాయస్థానములయందు, చరాస్తి జప్తునకు నుత్తరువులు బుట్టవు. వీరికి కాలదోషమననేమో దెలియదు. వీరిది కోయభాష. వీరి కోర్టులయందుండు న్యాయవాదులు మాట్లాడునది తెలుగుభాష. న్యాయాధిపతులవ్యావహారిక భాష యింగ్లము. కోయవానికి, తెలుగు తెలియదు. న్యాయవాదికి,కోయభాష తెలియదు. న్యాయాధిపతికి రెండుభాషలును దెలియవు. ఇచ్చటి న్యాయస్థానములనుగురించినవి చిత్రములన్నియు, విపులముగా, రెండవభాగమునందు వివరింపబడును.

కోయలుండు ప్రదేశములందు, గోదావరి ననుసరించి యుండు గ్రామములను గొమ్ముగ్రామములనియు, అడవియందుండు గ్రామములను గూడెములనియు వాకొనుచుందురు.

గోమ్ముగ్రామములని తెలగా గ్రామములని, బేర్కొనుట గూడగును. గోమ్ముగ్రామములందుండువారు యుత్తరప్రదేశంబుల నుండి వలసవచ్చినవారు. వీరినిగురించిన వివరములన్నియు రెండవభాగమునందు బూర్తిగా గానవగును. వీరలించుక గడుసువారలేగాని, పిరికివారు. అల్పసంఖ్యాకులుగ నున్నారు. తదితరులు బహుసంఖ్యాకులగు అడవిజాతివారు. వీరు యథార్థవాదులు. అన్యాయమననేమో నెరుంగరు. అక్షరజ్ఞానములేదుగాని, నిర్మలచేతస్కులు. ఒరులనొప్పింపని స్వేచ్ఛాజీవితేచ్ఛులు.

వీరి పశువులకు పుల్లరిలేదు. కావలసిన కలపకొట్టుకొనుట కభ్యంతరములేదు. వీరడవినిబంధనల నంతగా బాటింపరు. పాటింపబడుటకు నిర్బంధింపబడరు. కొన్నిరకముల చెట్లను గొట్టగూడదను నిబంధన నిప్పుడిప్పుడు ప్రవేశపెట్టుచున్నారు. అడవి మార్గములను వీరే ప్రతిసాలునా బాగు జేయుదురు. అందులకై ప్రభుత్వమువారివలనవీరలకుకొంత ప్రతిఫలమ ముట్టుచుండును. రిజర్వు అడవులు అగ్నిహోత్రుని కాహుతిగాకుండ, గాపాడవలెనని, యిట్టి నిర్జనప్రదేశములం దాపని, వీరి సహాయములేనిదే సాగదు.

వీరికి యాత్మగౌరవముమెండు. శిక్షాస్మృతి సూత్రములకు వశ్యులుగారు. తమజన్మస్వాతంత్ర్యమున కడ్డు గలిగినప్పుడు పితూరిజేయుటకు వెనుదీయరు. కాటక బాధచే జయిలునకు



బోవుట కిప్పుడిప్పు డిచ్చగింపుచున్నారు. జయిలునకు బోయినవాడుతిరిగివచ్చినతర్వాత, కులతప్పుబెట్టనియెడలవానికినిప్పయినను బుట్టనివ్వరు. వీరిపై మోపబడు నేరములకు, సాక్ష్యమక్కరలేదు. నిజముగా నేరము జేసినవారైన, నిర్భయముగా నేరము నొప్పుకొనును. శిక్షాస్మృతి సూత్రములచే వీరి నదపులో నుంపజూచుట బ్రమాదము.



